







# వ్యక్తిత్వ వికాసం

## నీ గమ్యం తెలుసుకో



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి
నన్ను "నేను" మార్చుకోవటానికి
"నేను" గా ఉండటానికి
మరియు అత్యుత్తమ జీవన విధానానికి
కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదవిజ్ఞానం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన సాగర్ సింధూరి గారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
2) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
3) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement
4) ఆండ్రాయిడ్ మొబైల్ ఆప్ : https://play.google.com/store/apps/details?id=free.telugu.bhakti.books

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



## రచయిత గురించి

సాగర్ సింధూరి, ప్రస్తుతం యువతకు ప్రేరణాత్మక ఉపన్యాసాలను ఇస్తూ వారిలో అద్భుతమైన ప్రేరణ కలిగించి వారి గొప్ప జీవితాలకు వారే బాటలు వేసుకొనేలా

**Minute Makers Motivation Club**

అను సంస్థను స్థాపించి పర్సనాలిటీ డెవలప్‌మెంట్స్ మరియు మోటివేషన్స్ నందు శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నారు.

**మీ గుండెల్లో నిండి ఉన్న అద్భుత శక్తిని మేల్కొలిపి మిమ్ములను లక్ష్యం వైపు నడిపించగల ప్రేరణ ఈ పుస్తకం**

ఎం.ఎ. సతీష్ యోధా

Cell : +91 - 789 313 45 45
Email : vidhyaasaagar.svs@gmail.com

Rs. 40/-

నీ గమ్యం తెలుసుకో

- సాగర్ సింధూరి

ఈ చిన్న పుస్తకం ఖచ్చితంగా మిమ్ములను విజయం వైపు నడిపిస్తుంది

# నీ గమ్యం తెలుసుకో



సాగర్ సింధూరి

# నీ

# గమ్యం

## తెలుసుకో

- సాగర్ సింధూరి

# Nee Gamyam Thelusuko

1st. Volume of

## A Complete Man

Author

**SAGAR SINDHURI**

# 4-5-7-1, Indra Nagar,
Madanapalle - 517 325, Chittoor Dist. A.P.
Cell : +91 - 789 313 45 45
Email : vidhyaasaagar.svs@gmail.com

This is a product of
Minute Makers Motivation Club
Madanapalle.

# అంకితం

చిన్ననాటి నుంచి చదువు సంధ్యాలు నేర్పించి,

నాలో మంచి నడవడిక కల్గించి,

నన్నింతవాడిని చేసిన నా పినతల్లి

**అల్లం భూదేవి** గారికి

మరియు నాకు గొప్ప జీవితాన్ని ఇచ్చిన

మా పినతండ్రి స్వర్గీయ

**ములరాజు నాగరాజు** గారికి

ఈ పుస్తకం ప్రేమతో అంకితం చేస్తున్నాను.

ఈ పుస్తకం రాయడానికి అన్ని విధాలా
ప్రోత్సహించిన నా మిత్రులు ...

**సతీష్, యోధా, బాలాజి, చైతు** లకు

మరియు

**శ్రీ రామమోహన్‌నాయుడు,** మాజీ ఆర్మీ గారికి

నా హృదయపూర్వక కృతజ్ఞతలు ...

నా ప్రియమైన భార్య **ప్రశాంతి** మరియు
**నా పిల్లలకు మరియు నా తల్లిదండ్రులకు**
ప్రేమ పూర్వక కృతజ్ఞతలు ...

# ముందుమాట

నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. అందుకే ప్రేమతో నా దేశానికి ఏదైనా ఇవ్వాలనుకున్నాను. ఏ గమ్యము లేకుండా చీకటిలో జీవితాలను వెలదీస్తున్న కొంతమంది యువతకు నా రచనలు, ప్రేరణాత్మక ప్రసంగాల ద్వారా వారి గుండెల్లో ఆత్మ స్థైర్యాన్ని నింపి వారిని ప్రేరేపించి అద్భుత జీవితాలను పొందగలిగేలా చేయాలని భావించాను. అలా గమ్యం కోసం నిత్యం పోరాడే యోధులనే నా భరతమాతకు ఇవ్వాలనుకున్నాను. దానికోసం ప్రయత్నిస్తున్నాను.

ఈ పుస్తకం, కేవలం వారిలో ఆలోచన పుట్టించి, ఒక లక్ష్యం గుర్తించి దానికోసం పోరాడే స్ఫూర్తిని ఇస్తుందని ఆశిస్తున్నాను.కొన్ని చోట్ల కొంచెం కఠినమైన పదాలు, వాక్యాలు, వ్రాయవలసి వచ్చింది. ఇటువంటి వాక్యాలు మీ మనసును నొప్పించింటే, గొప్ప మనసుతో క్షమించమని ప్రార్థన.

నేను చేస్తున్న ఈ ప్రయత్నంలో ఈ ప్రోత్సాహము నాకెప్పుడూ ఉంటుందని ఆశిస్తున్నాను.

సాగర్ సింధూరి

# విషయ సూచిక

# నీ గమ్యం నీవు తెలుసుకో ...!

" మరణించేలోగా నిన్ను నువ్వు ఒక్కసారైనా ఈ ప్రపంచానికి పరిచయం చేసుకో".

అవును, ఈ ప్రపంచానికి నువ్వెవరో తెలీకుండానే నీ జీవితం ముగిసిపోకూడదు. కనీసం, ఓ వంద సంవత్సరాలైనా నీ గురించి ఈ ప్రపంచం మాట్లాడుకోవాలి, నిన్ను గుర్తించుకోవాలి. "పుట్టిన చోటే పెరిగి, చదివి, పెద్దవాడై ఏదో బ్రతకడానికి ఓ ఉద్యోగం చేస్తూ నిరాశతో, నిస్పృహతో అతి సాధారణమైన జీవితాన్ని గడిపి కనీసం నీ పుట్టిన ఊరిలో కూడా నువ్వు గుర్తించ బడకుండా రహస్యంగా మరణించడం". ఎంత ఘోరం... ఎంత విచారకరం. ఇందుకేనా నువ్వు జన్మించింది. నీ పుట్టుకకు విలువలేదా? నీ బ్రతుక్కు అర్థమే లేదా? నీ అవసరం ప్రపంచానికి లేదా? ఏదో ఓ పేడ పురుగులా పుట్టి ... భారంగా బ్రతుకు ఈడ్చి ఇక చాలురా దేవుడా అంటూ గుట్టు చప్పుడు కాకుండా మరణించడమేనా?

కాదు ... ముమ్మాటికీ కాదు.

ఈ ప్రపంచపు భావి నిర్మాణంలో నీ పాత్ర తప్పక ఉండాలి. నువ్వు ఎక్కడ నిలబడినా ఆ చోటు నీ వల్ల గుర్తించబడాలి. బ్రతికే కొద్దిసమయమైనా తిరుగులేని విధంగా జీవించాలి. ఈ ప్రపంచం ... ఎల్లకాలం నిన్ను గుర్తించుకోవాలి. అనితర సాధ్యమైన ఓ విజయానికి నువ్వొక కొత్త మార్గం వేయాలి. ఎందరో నీవు నిర్మించిన ఆ మార్గంలో నడవాలి. చరిత్ర పుటల్లో నువ్వొక పేజీ కావాలి.

జీవించండి ఇలాంటి గొప్ప జీవితాన్ని జీవించండి. ఇంత గొప్పగా జీవించడానికి కావల్సిందేమిటో తెలుసా...?

# "నమ్మకం... ప్రయత్నం"

అవును.. నువ్వు అతి సాధారణమైన మనిషైనా సరే ... నువ్వు అసాధారణ జీవితాన్ని జీవించగలవు. ఎప్పుడంటే కేవలం " "నేను గొప్పగా జీవించగలను అని నిన్ను నువ్వు నమ్మినప్పుడు." ఇది చరిత్ర చెప్పిన సత్యం. ప్రపంచ విజేతలెవరైనా మొదట వాళ్ళను వాళ్ళు "ఏదైనా చేయగలం" అని నమ్మినవాళ్ళే. ఎందరో విజేతలు, గొప్పవాళ్ళు అనుభవజ్ఞులు గొప్ప విజయాలు సాధించడానికి వాళ్ళు కనిపెట్టి మనకు చెప్పిన విజయరహస్యం ఏంటో తెలుసా? "నమ్మడం".

"గొప్పగా జీవించగలను అని నిన్ను నువ్వు నమ్ము ...
ఖచ్చితంగా గొప్పగా జీవించగలవు"

గొప్పగా బ్రతకాలని, గొప్ప విజయాలు పొందాలని సాటిలేని జీవితాన్ని గడపాలని నీలో ఉన్న కోరికను నమ్ము ...

ఆ కోరిక తీరడానికి నువ్వు చేసే ప్రయత్నాన్ని నమ్ము.

ఆ ప్రయత్నంలో కష్టాలు నిన్ను ఏమీ చేయలేవని నిన్ను నువ్వు నమ్ము.

చివరకు విజయం నీదేనని పూర్తిగా నమ్ము....

భగవంతుడు ఒక ప్రత్యేకమైన పనిని చేయడానికే నిన్ను పుట్టించాడని నమ్ము... ఆ పని నువ్వు మాత్రమే చేయగలవని

నమ్ము. ఖచ్చితంగా నీ జన్మకు ఇవ్వబడిన కార్యాన్ని పూర్తి చేయగలవని నమ్ము.

లే ... మేలుకో... ఆలోచించు ... ఏమిటి నీ కోరిక?...

ఎలా జీవించాలని నీ కోరిక?... నీ లక్ష్యం ఏమిటి ? ...

ఎందులో నువ్వు ఆనందంగా ఉండగలవు ?

ఈ ప్రపంచానికి నువ్వు అందించబోయే బహుమతి

ఏంటి? తెలుసుకో... తెలుసుకొని ప్రయాణం ప్రారంభించు ... నేను ఈ ప్రపంచంలోని మనుషులను రెండే రకాలుగా వర్గీకరిస్తాను. ఒకటి గొప్ప లక్ష్యం ఉన్నవాళ్ళు ... రెండు ఏ లక్ష్యము లేని వాళ్ళు. నువ్వు మొదటి రకం వాడివి కావాలి. మహోన్నతంగా నువ్వు జీవించాలంటే మొట్టమొదట నీకు కావాల్సిందేమిటో తెలుసా..?

**“నీ లక్ష్యం ఏమిటో నీకు తెలియడం”**

అందుకే స్నేహితులారా! ప్రశాంతంగా ఆలోచించండి. నీలో రెండు రకాల మనిషి ఉన్నాడు. ఒకడు బాహ్య ప్రపంచం కోసం బ్రతికేవాడు.. రెండోది నీ లోపల నీ కోసం నీ సంతోషం కోసం బ్రతికేవాడు. నీ లోపల ఉన్నవాణ్ణి నిద్రలేపి అడుగు. నువ్వు ఏ పనిలో ఆనందంగా ఉంటావో ఏ పని నీకు జీవితాంతం ఎనలేని తృప్తిని, మనఃశాంతిని, ఆనందాన్ని ఇస్తుందో నీ లోపల ఉన్న నిన్ను అడుగు. నిజాయితీగా అడుగు. ధైర్యంగా అడుగు.

ఏ పని చేస్తే నీకు ఆనందంగా ఉంటుందో ... ఎలా బ్రతికితే నీకు నచ్చుతుందో ఆ పనిలోనే ఉంది నీ గమ్యం. ఆ పనిలోనే ఉంది నీ లక్ష్యం. నీకు నచ్చే పనిలోనే నీ గొప్ప లక్ష్యాన్ని గుర్తించు. ఎప్పుడైతే నీ గొప్ప లక్ష్యాన్ని నువ్వు తెలుసుకోగలవో అపుడే నీ విజయపు ప్రయాణానికి తొలి అడుగు వేసినట్లు. “ వెయ్యి మైళ్ళ ప్రయాణం కూడా తొలి అడుగుతోనే ప్రారంభమవుతుంది.” ఎప్పుడైతే నీ లక్ష్యం నీకు అవగతమైందో అపుడే నువ్వు నీ విజయాన్ని సాధించినట్లు లెక్క. ఏ సందేహమూ లేదు. నువ్వు ఎలాంటి వాడైనా సరే, ఎంత బలహీనుడైనా సరే, ఎంత నిరుపేదవైనా సరే, అంగవికలాంగుడైనా సరే ... నీ

లక్ష్యాన్ని నువ్వు చేరగలవ్.

చూడూ... భవిష్యత్‌లోకి తొంగిచూడు. నీ విజయం నిన్ను పిలుస్తోంది. నీ విజయం నీకై ఎదురు చూస్తోంది. దాన్ని చేరుకో... ఏ లక్ష్యమూ లేని బలహీన మైన జీవితం మనకొద్దు. మీ కోసం, మీరు సాధించబోయే విజయం కోసం ఈ ప్రపంచంలో ఒక ఖాళీ స్థానం కేటాయించబడింది. చరిత్రలో నీ అధ్యాయం కోసం కొన్ని పేజీలు ఖాళీగా వున్నాయి. నమ్మకమే నీ శక్తిగా, ప్రయత్నమే నీ వాహనంగా, లక్ష్యమే నీ గమ్యంగా ప్రయాణం ప్రారంభించు. చరిత్ర పుటల్లోని ఆ ఖాళీ పేజీలను నింపు. నీ చరిత్రను చిరస్మరణీయం చెయ్యి.

**" ప్రపంచంలో ఒక్కడిగా బ్రతకకు – ఈ ప్రపంచానికి ఒక్కడుగా బ్రతుకు"**

"ప్రతి గొప్ప విజయం వెనుకా ఒక గొప్ప నమ్మకం ఉంటుంది." అని గొప్ప తాత్వికుడు డిజ్ రేలీ అన్నాడు. "మన జీవితం చాలా చిన్నది. దాన్ని తుచ్ఛంగా గడపకండి మనలో చాలా మంది" "ఎందుకొచ్చిన జీవితం రా దేవుడా" అంటూ నిరాశగా రొచ్చులో జీవితం గడిపేస్తుంటారు. మరికొంత మంది తాతలనాటి ఆస్తిని హారతి కర్పూరంలా కరిగించేస్తూ, 'ఒక్కసారే వచ్చే జీవితం' చచ్చేలోగా పూర్తి మజా చేద్దాం అని బ్రతుకుతున్నారు. మనకు దేవుడు మనిషి జన్మనిచ్చింది "అంతా విధే చూసుకుంటుందిలే ఏది జరగాలని ఉంటే అదే జరుగుతుంది" అని పడుకొని చీకట్లో జీవితాన్ని గడపడానికి కాదు. అలా అని నీది కానిది నీ సంపాదన కానిదీ అయిన సంపదను ఖర్చు పెట్టుకుంటూ నీచమైన జీవితాన్నే భలే లైఫ్‌రా " అనుకుంటూ బ్రతకడానికి కాదు.

మన పుట్టుకకి ఓ విలువ కావాలి.

మన జీవితానికి ఒక పరమార్థం ఉండాలి.

మన బ్రతుక్కు ఒక చరిత్ర ఉండాలి.

ఆ చరిత్ర చిరకాలం చిరస్మరణీయం కావాలి.

ఇదంతా ఎలా జరుగుతుంది? నీవు అత్యున్నతమైన విజయం సాధించినపుడు, నీ జీవితానికి అర్థం తెలుసు కొన్నపుడు.

ఈ గొప్ప విజయం ఎలా వస్తుంది? నీకొక గొప్ప లక్ష్యం ఉన్నపుడు దానికోసం, నీవు ప్రయత్నించినపుడు.

ఈ గొప్ప లక్ష్యం ఎలా పుడుతుంది? గొప్పగా మారాలని నువ్వు కోరుకున్నపుడు, ఆమార్పు దిశగా నిన్ను నువ్వు మలుచుకున్నపుడు.

ఈ గొప్ప మార్పు ఎలా వస్తుంది ? ఎంతటి విజయమైనా సాధించగలనని నిన్ను నువ్వు ఆత్మశుద్ధిగా నమ్మినపుడు.

ఈ ఆత్మవిశ్వాసం ఎలా వస్తుంది? గొప్పవాళ్ళ చరిత్రలు, వారి అనుభవాలు తెలుసుకున్నపుడు వారు చెప్పినవి, రాసినవి నిజమని నమ్మినపుడు.

అవును మిత్రులారా...

ఆశే జీవితం.. నిరాశే మృత్యువు.

ధైర్యమే జీవితం... భయమే మృత్యువు,

ప్రయత్నమే జీవితం ... బద్ధకమే మృత్యువు.

నిరాశలను తుంచి బద్ధకాన్ని బద్దలు చేసి కఠోర దీక్షతో సంకల్పమే నీ ఆయుధంగా నీ విజయపథంలో నడువు... నీ సంకల్పపు వజ్రాయుధంతో వచ్చే అడ్డంకులను తెగనరుకుతూ

తిరుగులేని ధీరుడవై పోరాడి నీ విజయ పతాకం ఎగురవేయి ... వెయ్యేల్లు వర్ధిల్లి వర్ధిల్లు.

ఈ రోజే మీ లక్ష్యాన్ని గుర్తించండి ... ఆ లక్ష్యం గుర్తించడంలో నిజాయితీగా వ్యవహరించండి. గుర్తించి లక్ష్యాన్ని పదేపదే పలకండి. ఖచ్చితంగా లక్ష్యం సాధించగలమని నమ్మండి. మీ గొప్ప నమ్మకమే లక్ష్య సాధనకు మార్గాలు చూపిస్తుంది. ప్రకృతి గొప్ప లక్ష్యాన్ని నిరాకరించదు స్వాగతిస్తుంది. ఏదో మాయ జరిగినట్లు... అద్భుతంగా ఒక్కో దారే కనబడుతూ వస్తుంది. మొదటి మెట్టు ఎక్కగానే ఆశ్చర్యంగా రెండవ మెట్టు కన్పిస్తుంది. సీక్రెట్ అనే పుస్తకంలో ఇలా చెప్పబడింది. నువ్వు గెలుపునే గాఢంగా కోరుకుంటే గెలవడానికి కావాల్సినవన్నీ నిన్ను ఆకర్షిస్తాయి.

"నువ్వు గెలుపును ఆకర్షిస్తే మరింత పెద్ద గెలుపు
నువ్వు ఓటమిని ఆకర్షిస్తే ... తిరుగులేని ఓటమి వస్తాయి.

## "నమ్మకమే జీవితం"

"నమ్మకం" ఇది లేకుండా ఈ సృష్టే లేదుకదా?! ఆలోచించండి. నమ్మకం లేకుండా ఈ ప్రపంచంలో ఎలాంటి విజయమైనా, ఎలాంటి విషయాలైనా జరుగుతాయా? ఆలోచించండి.

నమ్మకం అనేది - ఈనాడు మరో ప్రతిసృష్టినే చేయగలదు. మంచినీ, చెడునీ రెండింటిని చేయగలదు. కానీ ! మనం మంచిని మాత్రమే నమ్ముదాం. గెలుపును మాత్రమే నమ్ముదాం... అద్భుత విజయం మనకు చేకూరబోతుందని నమ్ముదాం.

మీరు ఒక నెలలో కోటి రూపాయలు సంపాదించాలని అనుకుంటున్నారా! మీరు మీ సొంత విమానంలో దేశదేశాలూ తిరగాలని అనుకుంటున్నారా! ప్రపంచంలోనే గొప్ప వ్యాపారవేత్త కావాలని అనుకుంటున్నారా! ఇవన్నీ... ఎటువంటి సందేహం లేకుండా... నిస్సంకోచంగా ఎవరైనా, ఎలాంటి వారైనా... ఎంత పేదవారైనా, ధనికులైనా ... సాధించలరు. కానీ ఒక్క విషయం... మీరు అది చెయ్యలేనేమో ... ఇది సాధ్యమేనా అని ఆలోచనలను బలవంతంగా తుడిచివేసి... నూటికి నూరుపాళ్ళు నేను చెయ్యగలను అని "నమ్మండి".

ఈ నమ్మకమే ... ఎంతటి అసాధ్యమునైనా సాధింపజేస్తుంది. ఈ సృష్టినే సృష్టించగల నమ్మకం... మీక విజయాన్ని ఇవ్వలేదా? నమ్మండి. బలవంతంగానో లేక ఇష్టంగానో లేక నమ్మకంగానో ఈ పుస్తకంలోని విషయాలను నమ్మండి.

మీరు నమ్మడం వలన కలిగే లాభం ఏంటో తెలుసా...! మీరు కోరుకున్న మహోన్నత విజయం.. మీకు లభిస్తుంది.

మీరు ఎందుకు ఈ విషయాలను నమ్మాలంటే.....

ఒక నమ్మకం పనిచేసే తీరును మీకు వివరిస్తుంది. మీ విజయానికి కావాల్సిన శక్తిని, నేర్పును, మార్గాలను మీకు చూపిస్తుంది. నేను గొప్పగా మారగలను అనే నమ్మకమే... మీరెలా మారాలి అనే దారిని చూపిస్తుంది. విజయం సాధించడానికి మార్గాలను ఏర్పరుస్తుంది. ఎంతటి విజయాన్నైనా సాధించడానికి కావాల్సిన అత్యవసరమైన అతి ముఖ్యమైన మొట్టమొదిట అర్హత ఏంటో తెలుసా... "నేను సాధించగలను" అని నమ్మడం. నమ్మకానికి అపరిమితమైన శక్తి

ఉంది. అది మిమ్మల్ని ఎంత ఎత్తుకైనా చేరుస్తుంది.

ఎంతో శ్రమకోర్చి... ఎన్నో అనుభవాలనుంచి, మరెందరో విజేతల జీవితాల నుండి సంగ్రహించి సంకలనం చేసిన ఈ పుస్తకంలో చెప్పబడిన ప్రతి మాటా ప్రతి విషయమూ నూటికి నూరుపాళ్ళూ మీకు విజయం చేకూర్చడానికి... ఉద్దేశించబడిందే. ఈ పుస్తకంలోని ప్రతి మాటను మనస్ఫూర్తిగా నమ్మడం మొదలు పెట్టండి... ఖచ్చితంగా... మీరు మారడం మొదలు పెడతారు. విజయం సాధించేదాకా వెనుదిరగరు.

**"ఎందుకంటే నమ్మకమే విజయం"**

**"సందేహమే ఓటమి"**

## ఒక్క నిముషం చాలు... గొప్ప నిర్ణయాన్ని తీసుకోడానికి

సృష్టిలో వెనక్కి తీసుకురాలేనివి రెండు 'కాలం, ప్రాణం' ప్రాణం ఎంత విలువైనదో కాలం కూడా అంతే విలువైనవి. అసలు కాలమే మన ప్రాణం ఎందుకంటే ప్రతి మనిషికీ భూమి మీద నిర్ణీతమైన శ్వాసలు ఉంటాయి. ప్రతి మనిషికీ "ఇన్ని శ్వాసలు "అని జీవితకాలం ఉంటుంది. 3 క్షణాలకు ఒక శ్వాస తీసుకున్నా ఒక నిముషానికి 20 సార్లు శ్వాస తీసుకుంటాం. అంటే నిముషం గడిచిపోయిందంటే నీ జీవితంలో 20 శ్వాసలు తగ్గిపోయినట్లు. గంట గడిచిందంటే 1200 శ్వాసలు నీ జీవితకాలం తగ్గిపోయినట్లే. మనకి రోజుకి 1440 నిముషాలున్నాయి. రోజు గడిచిపోయిందీ అంటే 17,28,000 శ్వాసలు నీ జీవితకాలంలో ఖర్చు అయిపోయాయి. ఇప్పుడు ఒప్పుకుంటారా! కాలమే ప్రాణమని. మరి మహోన్నతమైన జీవితం అంటే  ఏమిటి... మన ప్రతి ఒక్క

శ్వాసకు గొప్ప విలువను ఆపాదిస్తూ జీవించడమే. ప్రతి నిముషమూ ఉన్నతంగా ఆలోచించడమే. ప్రతి నిముషమూ ఉన్నతమైన నిర్ణయాలు తీసుకొని ఉన్నత శిఖరాలను చేరుకోవడమే మహోన్నత జీవితం. ఒక గొప్ప మార్పు ఒక్క నిముషంతోనే ప్రారంభం అవుతుంది. ఒక్క నిముషంలోనే ఎంతో గొప్ప ఆలోచనలు ఉద్భవించాయి. చావు, పుట్టుక కూడా ఒక్క నిముషంలోనే జరుగుతాయి. ఇంత గొప్ప నిముషాన్ని ఈనాడు మనం ఎందుకు నిర్లక్ష్యం చేస్తున్నాం. చేయడానికి ఏమీ లేక బలవంతంగా నిముషాలను దొర్లించేస్తున్నామా ? మనవల్ల ఏమీకాదు ... మనకు ఈ జీవితమే చాల్లే అనుకొని గంటలను, రోజులను, నెలలను కరిగించేస్తున్నామా?

అతి విలువైన నిముషాలు వృధాగా, పేలవంగా... వృధా అయిపోవలసిందేనా. నిముషాల ముల్లు నీ వైపు జాలిగా చూస్తూ... 'అవకాశం ఇచ్చాను. మూర్ఖుడా నన్ను వృధా చేస్తున్నావు'? అని నీ మీద కాలం జాలి పడవలసిందేనా? కాలమే ప్రాణమని తెలుసుకున్న నీవు ఏ విధంగానూ ఒక గొప్ప నిర్ణయం తీసుకొని నిముషాలను సద్వినియోగం చెయ్యలేవా? అంతా మన చేతుల్లోనే వుంది పుట్టగానే దేవుడు ప్రతి మనిషికీ గొప్ప విజయాన్నిచ్చాడు. నీ ప్రయత్నం కేవలం ఆ విజయం దగ్గరకు చేరుకోడవమే. అలా ప్రయత్నించకుండా నీవే ప్రతి నిముషాన్ని, గంటను, రోజును, అతి క్రూరంగా, హేయంగా, నిర్భలంగా, నిరాశగా, వృధాగా చంపేస్తూ నీ విజయాన్ని ఒక్కొ అడుగూ దూరం చేసుకుంటున్నావు. ఇకచాలు ఈ బలహీనమైన, విలువలేని బ్రతుకు ఇకచాలు. మన బ్రతుకుని మార్చుకుందాం. మట్టితో నిండిన మన జీవితపు పాత్రను వజ్రాలతో నింపుదాం.

ప్రతి నిముషం ఒక వజ్రం... నీ జీవితకాలంలో ఎన్ని వజ్రాలను పోగేస్తే నీ దగ్గర అంత గొప్ప సంపద ఉంటుంది. స్నేహితులారా బాగా గుర్తించుకోండి.

**ఒక గొప్ప నిర్ణయం ... గొప్ప జీవితాన్నిస్తుంది.**

**ఒక గొప్ప నిర్ణయం ... ఒక గొప్ప లక్ష్యాన్నిస్తుంది.**

**ఒక గొప్ప నిర్ణయం ... నిన్ను ఉన్నతంగా మారుస్తుంది.**

ఈ గొప్ప నిర్ణయం కేవలం ఒక్క నిముషంలోనే స్ఫురిస్తుంది. మారాలన్న నిర్ణయానికి కేవలం ఒక్క నిముషమే చాలు. నీ జీవితాన్నే మార్చగల శక్తి ఒక్క నిముషంలో వుంది. ప్రతి నిముషాన్నీ నువ్వెంత విలువైనదిగా మార్చగలవు. ప్రతి రోజూ ఎంత విలువైన నిముషాల సంపద సమకూర్చగలవు. ఒక్క అతి విలువైన నిముషాన్ని నువ్వు ఖర్చుపెట్టావు అంటే, అంతకంటే విలువైనది నువ్వు పొందాలి. నీ లక్ష్యమేమిటో నిర్ణయిస్తుంది నీకున్న 'కాలం' విలువని. నువ్వు నెలకు లక్ష రూపాయలు సంపాదించడం నీ లక్ష్యం అయితే, నీ నిముషం విలువ 2.30 పైసలు అదే.. నెలకి కోటి రూపాయలు అయితే నీకు లభించే ప్రతి నిముషం విలువ సుమారు 230 రూపాయలు. ఇలా నీ లక్ష్యం ఎంత గొప్పదైతే నీ నిముషం అంత విలువైనది. ఒకే ఒక్క నిముషం మదర్ థెరిస్సా టివిలో కన్పించి విరాళం కోసం అడిగిందంటే.. కేవలం ఒక్క నిముషంలోనే వేలకోట్లు పోగవుతాయి. ఆ మహనీయురాలి నిముషం అంత విలువైనది.

కేవలం ఒక్క గంట ప్రసంగానికి 50 నుంచి 60 లక్షల రూపాయల వేతనం తీసుకుంటున్న వారు ఎంతో మంది ఉన్నారు. అంతెందుకు గొప్పనటులు ఒక్క గంటకు ఇన్ని లక్షలు

అని వేతనం తీసుకుంటున్నారు. వాళ్ళూ మనుషులే కదా, నీవూ మనిషివే కదా... మరి నీ నిముషానికి, లేదా గంటకు ఎంత విలువను నువ్వు సంపాదించి పెట్టావు? ఆలోచించు మిత్రమా. సరిగ్గా ఉపయోగించుకున్న నిముషాలే గొప్ప గంటలు అవుతాయి. గొప్ప గంటలే గొప్ప రోజులు అవుతాయి. నిముషాన్ని నిర్లక్ష్యం చేయకు. నిముషాన్నీ, కాలాన్నీ నీ బానిస చేసుకో... లేదా నువ్వే కాలపు బానిస అవుతావు.

నీలో నరనరాన జీర్ణించుకుపోయిన నిర్లక్ష్యమును, నిరాశలను, బద్ధకాన్ని, బాధ్యత లేని తనాన్నీ పటాపంచలుచేయ్. ఇకనైనా మేలుకో. కాలాన్ని చీల్చి చెండాడి దాన్ని నీ కాలికింద బానిసలా మార్చుకో. నిముషాలను ఆయుధాలుగా మార్చుకో. కనీసం ఒక్క నిముషమైనా వృధా చేయను అని ప్రతిజ్ఞ చెయ్. నువ్వు ప్రయత్నిస్తే ఆకాశాన్ని అందుకోగలవు. మనిషివి అయితే ఖచ్చితంగా నీకు అసాధ్యమైనది ఏదీ లేదు. కేవలం నీకు గొప్ప కలగనే ధైర్యం ఉండాలే గానీ! ఎంత అనితర సాధ్యమైన కలకూడా సాధ్యం అవుతుంది. నువ్వు ఏది కోరుకుంటావో అదే లభిస్తుంది. అందుకే గొప్పగా కోరుకో, గొప్ప ఆలోచనలు చెయ్... గొప్ప లక్ష్యం పెట్టుకో.... అన్నీ దొరుకుతాయి. ఈ ప్రపంచం నువ్వు ఎంత అడిగితే అంత ఇస్తుంది. నువ్వెంత అడగాలని నీవే నిర్ణయించుకోవాలి.

**గుర్తుంచుకో ప్రతి నిముషాన్ని అతి విలువైనదిగా మార్చుకో**

**ఒక్క నిముషంలో గొప్ప నిర్ణయాలు తీసుకోగలవు**

**ఒక్క నిముషంలో ఓటమిని గెలుపుగా మార్చగలవు**

**ఒక్క నిముషంలో ఎంతో జ్ఞానాన్ని సంపాదించగలవు**

**ఒక్క నిముషంలో మంచి పుస్తకంలోని ఒక సూక్తి చదవగలవు.**

**ఒక్క నిముషంలో గొప్ప ప్రసంగం చెయ్యగలవు.**

**ఒక్క నిముషంలో గొప్ప ఊహాలను ఊహించగలవ్..**

నువ్వు చెయ్యాలే గానీ ఒక నిముషం తక్కువేమీకాదు.. అందుకే మనం గొప్ప నిర్ణయం తీసుకుందాం. ఇకనైనా మారాలని ఒక గొప్ప లక్ష్యం చేసుకుందాం - ఖచ్చితంగా 'సాధించాలని' ప్రతి నిముషాన్నీ గొప్పగా వినియోగించుకుందాం - సంవత్సరాలు కాదు, నెలలు కాదు, రోజులు కాదు, గంటలు కాదు, కేవలం మనం నిముషాలపై గురిపెడదాం. గొప్ప విజేత కావాలంటే... నువ్వు ఉపయోగించే ప్రతి నిముషమూ నిన్ను నీ లక్ష్యానికి మరింత దగ్గర చెయ్యాలి. నువ్వు ఉపయోగించుకునే తీరు చూసి ఆ నిముషమే భయంతో కంపించిపోవాలి. నువ్వు గడియారం చూడకూడదు. గడియారమే నిన్నుచూడాలి. ప్రారంభించు నీ ఉధృతమైన యుద్ధం, ఈ క్షణమే ప్రారంభించు. నీ తర్వాతి నిముషాన్నే నీ విజయ సోపానంగా మార్చుకో.

## ఉన్నతమైన లక్ష్యాన్ని గుర్తించు

గొప్ప నిర్ణయం గొప్ప లక్ష్యాన్ని నిర్దేశిస్తుంది. ప్రస్తుతం మీకు లభించిన ు జీవితం, మీస్థితి, గతంలో మీరు తీసుకున్న నిర్ణయం తాలూకు ఫలితం. ఎపుడైనా మీరు మీ గురించి శ్రద్ధగా ఆలోచించారా? మిమ్ములను మీరే క్రింది ప్రశ్నలు వేసుకోండి ...

1. నేనేంటి? నాకున్న సామర్థ్యాలు ఏమి?
2. అసలు నాకు ఏపని చేయడం అంటే ఇష్టం?
3. ఏ పనిలో నేను ఆనందాన్ని పొందుతాను?
4. నా భవిష్యత్తులో నేను ఎలా వుండాలి?
5. ప్రస్తుతం నేను ఎలా వున్నాను?
6. నేను సరైన మార్గంలోనే వెళ్తున్నానా?
7. నాకు గొప్పగా బ్రతికే మార్గాలు ఏవైనా వున్నాయా?
8. నేను అనుకున్నవి జరగకుండా అడ్డుపడుతున్నవి ఏవి ?
9. నాకు కోరుకున్నవి దొరుకుతాయా? ఇల్లు,కారు, డబ్బు మొ॥
10. నా లక్ష్యాన్ని చేరనీయకుండా చేస్తున్న నాలోని లోపాలు ఏవి?
11. అసలు నేను కలగన్న జీవితం నాకు లభిస్తుందా లేదా?

ఇలాంటి ప్రశ్నలు వేసుకోవడం ఎపుడు ప్రారంభిస్తావో ఖచ్చితంగా నువ్వు మారాలని ప్రయత్నిస్తున్నట్లు. పైన చెప్పిన ప్రశ్నలన్నీటికీ సమాధానాలు రాసుకోండి. చాలా శ్రద్ధగా మీరు రాసుకున్న సమాధానాలు తెలుసుకోండి. ఇపుడు సరైన సమాధానం లేని ప్రశ్నల గురించి ఆలోచించండి. మీరు ఇపుడు ఆలోచించడం మొదలెట్టారంటే మీ గొప్ప జీవితానికి సంబంధించిన విత్తనం మీ మనసులో నాటుతున్నారని అర్థం. గొప్ప జీవితం కావాలనుకునేవాళ్ళు కనీసం ఇపుడైనా ఆలోచించండి. అంత గొప్ప కల నిజం చేసుకోడానికి శ్రద్ధగా

మీవంతు కృషి చేయండి. ఎందుకంటే మీ కలను మీరు నిజం చేసుకోబోతున్నారు. మీలో ఈ ఆలోచన రగిలిందంటే మీరు సరైన మార్గంలోకి వెళ్తున్నారని నేను ఖచ్చితంగా, రూఢీగా చెప్పగలను. మరింత లోతుగా ఆలోచిస్తే మీకు సమాధానం దొరుకుతుంది.

ఇపుడు మీరు రాసుకున్న సమాధానాలను ఒకసారి చదవండి. మీ సమాధానాలు పూర్తిగా మీకు సంతృప్తిని ఇచ్చాయా? ఆలోచించండి. ఒక వేళ మీకు అసంతృప్తిగా ఉన్నాయనిపిస్తే క్రింది విశ్లేషణ చదవండి.

**మొదటి ప్రశ్న**

**1. నేనేంటి నాకున్న సామర్థ్యం ఏంటి?**

ఈ ప్రశ్నకు చాలావరకు సమాధానం మీ దగ్గరే వుంది. మీరెలాంటివారు ఆశావాదులా? నిరాశావాదులా? మీ మీద మీకు ఆత్మ విశ్వాసం ఉందా? అనుకున్న పనిని మీరు సమర్థవంతంగా చేయగలరా? మీలో ప్రత్యేకమైన సామర్థ్యాలు ఏవైనా ఉన్నాయా? ఇలాంటి ప్రశ్నలతో మీరేంటో మీ సామర్థ్యం ఏంటో మీకు తెలుస్తుంది.

ఒక వేళ ఏ సామర్థ్యమూ, ప్రత్యేకతలుమీలో లేకపోయినా ఫర్వాలేదు.. ఖచ్చితంగా మీరు కలగన్న జీవితం పొందగలరు. ఆశ్చర్యంగా ఉందా? ఆశ్చర్యం ఏమీలేదు. భగవంతుడు ప్రతి మనిషికీ ఇష్టమైనపని, ఒక సామర్థ్యమూ ఖచ్చితంగా ప్రసాదించాడు. బాగా ఆలోచించండి. ఇంతవరకు మిమ్మల్ని ఎవరైనా పొగిడారా, మెచ్చుకున్నారా. మీరు చేసిన ఏదైనా పని మీకు గుర్తింపు తెచ్చిందా? ఒకసారి బాగా ఆలోచించి చూడండి. ఖచ్చితంగా సమాధానం లభిస్తుంది.

పాడైన వస్తువుల్ని రిపేరీ చెయ్యడమో, స్పష్టంగా మాట్లాడగలగడమో, అద్భుతమైనశరీర ధారుడ్యం కల్గిఉండటమో, పాటలు పాడటమో, బొమ్మలు గీయడమో, మంచి వ్యాపారం చేయగల నేర్పో, పది మందిని మీ వెంట నడిపించగల నాయకత్వమో, మీ మాటలతో ఎదుటివారిని ప్రభావితం చెయ్యగల్గడమో, వస్తువులను శుభ్రంగా చేయడమో, బాగా డాన్స్ చెయ్యడమో ఇలా... ఖచ్చితంగా మీరు బాగా చెయ్యగల్గింది ఒకటి ఖచ్చితంగా మీలో ఉంటుంది. దాన్ని గుర్తించి ఒక పేపర్ పై రాసుకోండి.

ఇపుడు మీకు ఉన్న ఒక ప్రత్యేకమైన సామర్థ్యం తెలిసిందా?

అయితే ఇపుడు దాని గురించి ఆలోచించండి.

**2వ ప్రశ్న 3వ ప్రశ్న**

**అసలు నాకు ఏ పనిచేయడం ఇష్టం?**

**ఏ పనిలో ఆనందాన్ని పొందుతాను?**

ఈ ప్రశ్నలకు నిజాయితీగా సమాధానం కోసం మీ మనస్సును అడగండి. ఉదాహరణకు మీరు ఇంటిని బాగా అలంకరించగలరు అని మీ సామర్థ్యాన్ని తెలుసుకున్నారు అనుకుందాం. అయితే ఇపుడు బాగా ఆలోచించండి. మీరు ఇంటిని బాగా అలంకరించడం అనే పని చేయడం మీకు ఇష్టమేనా? బాగా ఇష్టమేనా? ప్రశ్నించుకోండి. మీరు ఇష్టంతో మీ ఇంటిని బాగా అలంకరించుకోగలరు అని మీకు అనిపిస్తే వెంటనే ఆలోచించండి. మీకిష్టమైన పనితోనే మీరు గొప్ప వ్యాపారం ప్రారంభించి అత్యంత ధనవంతుడైతే... ఆ వ్యాపారం లేదా ఆ పని మీకు ఆనందాన్నిస్తుందా? అని ప్రశ్నించుకోండి. మీకిష్టమైన పని ద్వారా గొప్ప వ్యాపారం ప్రారంభించి మీకు

కావాల్సినవి అన్నీ సంపాదించుకొని ఆనందంగా గడపగలగడం నిజంగా మీకు ఆనందమేనా ఆలోచించండి.

అవును ఒక వేళ నాకిష్టమైన ఈ పనిలో నేను వ్యాపారం ప్రారంభించి అత్యంత ధనవంతుడవ్వగల్గితే అదినాకు చాలా ఆనందాన్నిస్తుంది అని నిశ్చయంగా మీకు అన్పించిందా?... అయితే ఇంకేమీ అవసరం లేదు.. ఖచ్చితంగా ఈ పనినే మీలక్ష్యంగా మార్చుకోండి. అది కూడా అత్యున్నతమైన లక్ష్యంగా ... ఎలా అంటే ...

ఉదా : నేను ఇంటిని బాగా అలంకరించగలను కాబట్టి నేను ఈ దేశంలో ప్రసిద్ధిగాంచే ఇంటీరియర్ డెకరేషన్స్ కంపెని ప్రారంభించి కోట్లలో వ్యాపారం చేయాలి.

ఇదే నీ అంతిమ లక్ష్యం... ఇదే నీ గొప్ప కల... ఇదే నీవు సాధించబోయే విజయం.

**4వ ప్రశ్న**

**నా భవిష్యత్తులో నేను ఎలా ఉండాలి?**

ఎపుడైతే నీ లక్ష్యాన్ని గుర్తించగలిగావో... అప్పట్నించి నీ ఊహలకు రెక్కలను తొడుగు. నీలక్ష్యం చేరుకోవడం పూర్తి అయితే నువ్వెలా వుండాలో ఊహించు, కల గను. నువ్వు నీ ఇంటీరియర్ డెకరేషన్స్ కంపెనిలో వందమంది నీ క్రింద పనిచేసే ఉద్యోగులతో ఒక మీటింగ్‌లో ఉన్నట్లు. ఆఫీసు నుండి ఇంటికి రాగానే (నీ బెంజ్ కారులో)... హాయిగా నీ ఇంటి కోటలో ఉన్న స్విమ్మింగ్ ఫూల్‌లో సేద తీరినట్లు, సింగపూర్‌కో, డార్జిలింగ్‌కో నీ ఫ్యామిలితో విమాన ప్రయాణం చేసినట్లు. నీ కుటుంబం, పిల్లలతో గొప్ప ప్రదేశాల్లో నీ సెలవులు గడిపనట్లు ...

ఇలా నీ ఊహలకు ఎంతహద్దు ఉందో... అంతవరకూ

ఊహించు. కలలు కను. ఎందుకంటే ఇవన్నీ నిజమవ బోతున్నాయ్ ! సందేహమే లేదు.

నువ్వు కన్న ప్రతి కలను నీ డైరీలో రాసుకో లేదా అందమైన చిత్రం వేసుకో...

తర్వాత ప్రతి కలా నిజమైనట్లు ప్రతి ఉదయం భావించు... నీ గమ్యాన్ని నీ కలనుమొదట నమ్మాల్సింది నువ్వే... మరెవ్వరూ నీ కలను నమ్మరు. నువ్వు మాత్రమే నమ్మాలి. నేను ఇది వరకే చెప్పాను ఆత్మ శుద్ధిగా నమ్మినది తప్పక ఫలిస్తుంది. ఇపుడు నువ్వెంతగానో గర్వించే సమయం వచ్చింది. ఎందుకంటే నీకు అద్బుతమైన లక్ష్యం ఉంది. అద్భుతమైన ఉన్నతమైన కలలు ఉన్నాయి. నువ్వు విజేతవు కాబోతున్నావు. నీ కలలు నిజమయ్యేలోపే అందులో నువ్వు విహరించు.

ఇంత గొప్ప లక్ష్యం ఇంత గొప్ప కల నువ్వు పొందినందుకు నీ మనసుకు కృతజ్ఞతలు చెప్పు.

ఇక తర్వాతి అతి ముఖ్యమైన రహస్యం చెబుతాను. నా గొప్ప కల నిజమవుతుంది అని పూర్తిగా ఘాడంగా ఎటువంటి సందేహము లేకుండా రూఢీగా నమ్ము. ఎందుకంటే

**నువ్వు కోరుకోగల్గితే నీకది లభిస్తుంది.**

**నువ్వు నీ భవిష్యత్తును చూడగల్గితే అది నిజమవుతుంది.**

**నువ్వు నీ కలను సరిగ్గా నమ్మగల్గితే అది నిజమవుతుంది.**

ఈ సృష్టిలోని గొప్ప విజయరహస్యం ఇదే. దీని గురించి సీక్రెట్ అనే బుక్‌లో చదవండి. కోరుకో గల్గితే, కల కనగల్గితే ప్రతీది దక్కుతుందని మీకు అర్థమవుతుంది.

## 5వ ప్రశ్న

## ప్రస్తుతం నేనెలా ఉన్నాను?

అయ్యో! నాకేమో గొప్ప లక్ష్యం తెలిసింది. నా కలలు ఎంతో గొప్పగా ఆకాశం అంత ఎత్తులో అసాధ్యమైనవిగా ఉన్నాయి. కానీ, నేనేమో చాలా బలహీనంగానూ, పేదవాడిగానూ, ఎన్నో దురలవాట్లతోనూ నిరాశతోనూ, బద్ధకంతోనూ... ఉన్నాను.. ఇలాంటి వాడికి కలలు నిజమవుతాయా? అని సందేహం వచ్చిందా...! అయితే వెంటనే ఒక పని చెయ్యండి. మీ సందేహాలన్నింటిని దారుణంగా చంపేయ్యండి. మీ అనుమానాలన్నింటినీ పటాపంచలు చేసేయ్యండి. ఎందుకంటే ప్రస్తుతం నీ స్థితి ఎలా ఉన్నా... ఖచ్చితంగా నువ్వు విజయం సాధించగలవు. ఎందుకో తెలుసా.... రేపట్నుంచే నువ్వు మారబోతున్నావు. నీ లక్ష్యం... నిజమైనదే. అయితే ఓ పట్టాన నిన్ను ఊరికే ఉండనివ్వదు. అన్ని విధాలుగానూ సమర్ధుడిగా నిన్ను తయారు చేసుకుంటుంది. నిర్ణయం తీసుకోండి. ఈ స్థితిలో మీ నిర్ణయం మీ భవిష్యత్తుని ఫలింపజేస్తుంది. మీలోని చెడుగుణాలని, మంచిగా మార్చుకోవాలని కఠిన నిర్ణయం తీసుకోండి.

సమయాన్ని హారతి కర్పూరంలా వృథాగా కరిగించేసే మీ పద్ధతి మార్చుకోవాలని నిర్ణయం తీసుకోండి. మీలోని సామర్థ్యాలను ఒక్కొక్కటిగా పెంచుకోవాలని నిర్ణయం తీసుకోండి. ఎటువంటి పరిస్థితుల్లోనైనా, ఎంతటి కష్టమైనా సరే... నీ చెమటను రక్తంలా చిందించి అయినా సరే.. సవాళ్ళను ఎదుర్కోనైనా సరే మీ కలను నిజం చేసుకోవాలని నిశ్చయంగా నిర్ణయించుకోండి. మీ కలలు తీరడానికి మీ కోర్కెలకు బలాన్ని

ఇవ్వాలని నిర్ణయించుకోండి. మీకు తెలుసా గొప్ప విజయాలు ఎలా సాధ్యమవుతాయో? **గొప్ప నిర్ణయం తీసుకోవడం వలన.** అందుకే మీ మార్పుకై, మీ ఉన్నతికై, మీ విజయానికై ఈ రోజే మీరు గొప్ప నిర్ణయం తీసుకోండి.

**6వ ప్రశ్న, 7వ ప్రశ్న**

**నేను సరైన మార్గంలోనే వెళ్తున్నానా ?**

**నాకు గొప్పగా బ్రతికే మార్గాలు ఏవైనా ఉన్నాయా?**

మీరు మీ లక్ష్యం నిర్దేశించుకోవడం పూర్తయ్యిందా... మీ లక్ష్యం సాధించుకోవడానికి మీరు మిమ్మల్ని మార్చుకోవాలని అనుకుంటున్నారా... అలా మారాలని నిర్ణయం తీసుకున్నారా....

అయితే ఇంతకు ముందు మీరు ఏ మార్గంలో వెళ్ళి ఉన్నా ఫర్వాలేదు. ఇపుడు మాత్రం సరైన మార్గానికే వచ్చారు. ఖచ్చితంగా మీరు సరైన మార్గంలోనే ఉన్నారు. మీరిపుడు ఆలోచించండి. మీరు గొప్పగా బ్రతకడానికి కావాల్సిన అన్ని అవకాశాలు మీ లక్ష్యంలోనే మీకు లభిస్తాయి. అవును నిజం. నమ్మకంతో మీరు మొదటిమెట్టు ఎక్కగల్గితే అద్భుతంగా ఆశ్చర్యంగా మీకు రెండవ మెట్టు సాక్షాత్కరిస్తుంది. ఎందుకంటే గొప్పవి, నిజాయితీవి అయిన కలలను ఈ ప్రకృతి నిరాకరించదు. అని ఓ మహానుభావుడు అన్నాడు. విజయం పొందాలనే తీక్షణమైన కోరికే నువ్వు నీ విజయం పొందడానికి కావాల్సిన మార్గాలను నీ దగ్గరికి తీసుకువస్తుంది. నువ్వు పెట్టుకున్న నీ ఆశయం నిజం చేసుకోవడానికి ఎలా ప్రయత్నించాలో, ఏ మార్గాలను అనుసరించాలో ఇపుడే నీకు తెలియకపోయినా ఫర్వాలేదు. కానీ ఖచ్చితంగా 'నాకల

నిజమవుతుంది’ అని మాత్రం నమ్మండి చాలు. అలా నీ లక్ష్యాన్ని పూర్తిగా నమ్మడమే నీ మొదటి మెట్టు. ఇపుడు ఈ మొదటి మెట్టు మీరు ఎక్కిన తర్వాత రెండవ మెట్టు అనుకోకుండా, ఆశ్చర్యంగా నీకు కన్పిస్తుంది ఎలాగో తెలుసా! నీ లక్ష్యాన్ని సాధించుకోగల్గే దారులు కోసం నువ్వు వెదకడమే నీ రెండవ మెట్టు. ఆలోచించండి. మీ లక్ష్యం గురించి పూర్తి సమాచారం సేకరించడానికి ప్రయత్నించండి. అదే లక్ష్యంతో విజేతలైన వారి గురించి చదవండి. ఆ లక్ష్యంలో ఉన్న ఇబ్బందులను ఎలా ఎదుర్కోవాలో తెలుసుకోండి ...

**ఉదా :-** ‘దేశంలోనే గొప్ప ఇంటీరియర్ డెకరేషన్స్ సంస్థ’, ఇదే మీ లక్ష్యం అయితే ఇంటీరియర్ డెకరేషన్స్ గురించిన క్రొత్త పద్ధతులు గురించి తెలుసుకోండి, కొత్త వస్తువుల గురించి, కొత్త డిజైన్ల గురించి, అలాంటి సంస్థల పనితీరు గురించి, ఇంటీరియర్ లో గొప్ప వాళ్ళైన వారి గురించి వాళ్ళు ఏ స్థాయి నుండి తమ ప్రయాణం మొదలెట్టారో తెలుసుకోండి. ఇంటిని అలంకరించడంలో మీ నైపుణ్యాలను ఎలా మెరుగుపరుచుకోవాలో తెలుసుకోండి. దానికి కావాల్సినది ఏమేమి నేర్చుకోవాలో తెలుసుకోండి. ఇలా మీ లక్ష్య సాధనకు కావాల్సిన ప్రాథమికి అవసరాలను గుర్తించడమే మీ రెండవ మెట్టు. చూశారా ! నమ్మకంతో మొదటి మెట్టు ఎక్కగానే రెండవది ఎలా కన్పించిందో. దీని గురించి సీక్రెట్ అనే పుస్తకంలో ఒక వివరణ ఉంది. చీకట్లో మనం కారులో ఒక కొత్త ప్రదేశానికి వెళ్ళాలని ప్రయాణం ప్రారంభించాం అనుకోండి. మన కారు లైట్ల వెలుగులో మనకు దారి కేవలం ఒక 20 అడుగుల దూరం మాత్రమే కన్పిస్తుంది.

ఆ వెలుతురును ఉపయోగించుకొని కన్పించే ఆ 20 అడుగుల దూరం వెళితే వెంటనే ఆ వెలుతురు ఇంకో 20 అడుగుల దారిని చూపిస్తుంది. కేవలం 20 అడుగుల వెలుతురు నిచ్చే కాంతిలోనే మనం చివరకి మనం వెళ్ళాల్సిన క్రొత్త ప్రదేశానికి చేరుకుంటాం. చూశారా! గొప్ప లక్ష్యం అనే కాంతి, నమ్మకం అనే వాహనం మన దగ్గర ఉంటే ఒక్కో మెట్టు మనకు వాటంతట అవే కన్పిస్తాయి.మనం చేసే ప్రయత్నమే కొద్దికొద్దిగా మనల్ని గమ్యానికి చేరుస్తుందని ఒక గొప్ప తత్వవేత్త అన్నాడు. మనం ఎలా మన లక్ష్యాన్ని చేరుకుంటాం? **మనం మన లక్ష్యం వైపు ఒక్కో అడుగే వేసుకుంటూ నడిచినపుడు.** అవును మీరు ఖచ్చితంగా మీ సమయాన్ని మీ లక్ష్యం నిజం అయ్యే మార్గంలోనే వినియోగించుకోండి. మీరు సంపాదించే ఏ చిన్నపాటి జ్ఞానమైనా అది మీ లక్ష్యం సాధించేందుకు ఉపయోగపడాలి. "సమయాన్ని ఖచ్చితంగా మీ విజయం కోసం ఖర్చు చేయాలేగానీ మీకు లెక్కలేనన్ని మార్గాలు దొరుకుతాయి."

ఇక్కడ మీకొక సన్నివేశం చెబుతాను. ఇది నా జీవితంలో జరగిన ఓ సన్నివేశం. నా స్నేహితుడొకడు కొయ్యతో తలుపులు, కిటికీలు చేయడంలో ఎంతో అనుభవాన్ని గడించాడు. కానీ అతనికి తన పనిపైన విశ్వాసం వుండేదికాదు. అందులో కావాల్సినంత డబ్బు సంపాదించలేనని, నేను గొప్ప లక్ష్యాలేవి ఆ పనిలో పెట్టుకోలేనని బాధపడేవాడు. అతనితో నేనొకసారి మాట్లాడాను. ఒక గంట సంభాషణ తర్వాత అతును మేల్కొన్నాడు. తన పనిలోనే తాను ఎంత ఎత్తు వరకు వెళ్ళవచ్చో

ఊహించగల్గినాడు. ఆ రోజు ఇంటికి వెళ్ళిపోయి నా మాటలతో బాగా ప్రభావితం అయ్యాడు. మరుసటి రోజు ఉదయం నా దగ్గరికి ఎంతో సంతోషంగా వచ్చి నాకొక లక్ష్యం దొరికిందని.. నేను దానికోసమే పనిచెయ్యబోతున్నానని చెప్పాడు. ఇంతకీ అతని లక్ష్యం ఏమిటంటే ఇళ్ళలో  అందంగా అమర్చుకొనే కళాత్మకమైన అల్మారాలు తయారు చేసే కంపెనీ పెట్టాలని... ఆ కంపెనీ బాగా వృద్ధి చేసి ప్రపంచదేశాలకు తన వున్న ఉత్పత్తులను ఎగుమతి చెయ్యాలని

ఒక్క రోజువారి కూలీ చేసుకొనే అతి సామాన్యమైన ఒక వడ్రంగి ఒక గొప్ప నిర్ణయం తీసుకొని గొప్ప విజయం కోసం ప్రయత్నిస్తున్నాడు. ప్రస్తుతానికి అతడు ఉంటున్న టౌన్‌లోనే తన ఫర్నీచర్, అల్మారాస్ తయారు చేసే కంపెనీని విజయవంతంగా నడుపుతున్నాడు. భవిష్యత్తులో తన లక్ష్యం తప్పకుండా పూర్తి చేసుకుంటాడు. కనుక మిత్రులారా మీకు అనుభవమున్న పనిని ప్రేమించండి. సాధ్యమైతే మీకు సామర్ధ్యం ఉన్న పనిలోనే గొప్ప లక్ష్యాలను నిర్మించుకోండి.

**ఈ ప్రపంచంలో నిజం కాని లక్ష్యాలు ఉండవు.**

**8వ ప్రశ్న,    9వ ప్రశ్న**

**నేను అనుకున్నవి జరగకుండా అడ్డుపడుతున్నవి ఏమి?**

**నాకు కోరుకున్నవన్నీ దొరుకుతాయా? ఇల్లు, కారు, డబ్బు మొదలైనవి?**

ఈ రెండు ప్రశ్నలకు నువ్వు నీ విజయం కోసం చేసే ప్రయత్నాలే సమాధానాన్ని ఇస్తాయి. నీ లక్ష్య సాధనకు అడ్డుపడే

పరిస్థితులు ఏవైనా కావచ్చు. ఉదా: పేదరికం, బద్ధకం, గొప్పగా ఆలోచించలేనని నీవు నమ్మడం, నీ స్నేహితుల నుండి వచ్చే విమర్శలు, నీ లక్ష్యం కోసం సమయాన్ని కేటాయిస్తే ప్రస్తుత నీ కుటుంబ ఆర్థిక స్థితి ఎలా? ప్రస్తుతం నా కుటుంబానికి డబ్బు ఎలా సంపాదించాలి? ఇలాంటి ఎన్నో అడ్డంకులు ఏవైనాసరే అవన్నీ మార్చుకోగల్గేవే. సమస్యల్ని ముందుగానే ఊహించు. తర్వాత ఆ సమస్యలు నిన్ను భయపెట్టవు. ప్రపంచంలో ఏ సమస్యా నీకున్న భయం కంటే పెద్దదికాదు. నీ భయమే సమస్యకన్నా చాలా పెద్దది. నువ్వు ఏలక్ష్యం కోసమూ పని చేయకున్నా... నిన్ను ఇలాంటి సమస్యలు వదలిపెట్టవు. అందుకని సమస్యలున్నా సరే ఖచ్చితంగా నీ పోరాటం కొనసాగించాలి. మనిషికి నిరంతరం సమస్యలతో యుద్ధం అనివార్యం. నీ ఒక్కడికే కాదు. విజేతలందరికీ ఇలాంటి సమస్యలు ఉండనే ఉంటాయని గ్రహించు. ఎలా వాళ్ళు విజేతలయ్యారు? వాళ్ళు వాళ్ళ సమస్యలను వాళ్ళ లక్ష్యం ముందు ఎంతో చిన్నవిగా చూశారు. మనసుపెడితే మార్గం దొరుకుతుంది. నీ లక్ష్యాన్ని సాధించాలనే నీ ప్రేరణను, నీ సమస్యలు నీరు గార్చేటట్టు చేస్తున్నాయా అయితే ఒక పని చేయండి.

ఆ చిన్న సమస్యలను నీరు గార్చేలా, సమస్యలను సమసిపోయేలా చేయడమే మీ 3వ మెట్టని గ్రహించండి. ప్రతి సమస్యకూ సృష్టిలో పరిష్కారం ఉంది. రగిలే కసితో సమస్యలను నిర్వీర్యం చేసే మార్గాలకై వెదకండి. ఏ ప్రయత్నమూ చేయకుండా ఉత్తినే విజయం వరించడానికి నువ్వు చేసుకున్న లక్ష్యం, నీకల, అంత చిన్నవేమీ కాదని తెలుసుకోండి. ఇలా

సమస్యల అడ్డంకులను దాటుకున్న వాళ్ళే విజేతలయ్యారని తెలుసుకోండి.

మీకు ఏ అనుమానమూ లేదు, నువ్వు నీ లక్ష్యాన్ని నిరంతరం గుర్తించుకో.. ఏ సమస్యా నీకు అడ్డంకి రాదు... ప్రయత్నించండి. మీకే నిజం తెలుస్తుంది. అయినా, కష్టాలు పడకుండా వచ్చే విజయం నిలకడగా ఉండదు.

కేవలం సమస్యలపై నీకున్న భయమే నిన్ను నీ లక్ష్యం వైపు పరుగుతీసేలా ఆపుతోందని గ్రహించండి. భయాన్ని వీడండి. సమస్యకు సవాల్ విసరండి. సమస్యతో యుద్ధం చేయండి. మీ సంకల్పం ముందు అది చాలా బలహీనమైనది. విజేతలు మీరే అవుతారు. ఇది చరిత్ర చెప్పిన విజయ రహస్యం. నిరంతరం నీ విజయాన్ని నువ్వు కోరుకుంటే, నీ కోరికను నువ్వు నమ్ముతూ వుంటే, కల నిజమైనట్లు నువ్వు భావించగల్గితే తప్పక విజయాన్ని నువ్వు చేరుకుంటావ్.

నీకు కావాల్సినవి అన్నీ నీ లక్ష్యమే నీకు ప్రసాదిస్తుంది. కారు, ఇల్లు, డబ్బు, ఏదైనా.... నీ మనసు ఒక గొప్ప శక్తి క్షేత్రం... నీ గొప్ప లక్ష్యాన్ని ఈ విశ్వానికి తెలియజేయి... అది సాధించడానికి మార్గాలు నీ వైపుకి రావడం మొదలు పెడతాయి.

**10వ ప్రశ్న**

**లక్ష్యాన్ని చేరనీయకుండా చేస్తున్న నాలోని లోపాలు ఏవి?**

బాగా ఆలోచిస్తే నీలోని లోపాలు నీకే తెలుస్తాయి. సాధారణంగా ఒక మనిషిలో అతి సహజంగా ఉండే కొన్ని పనికిరాని గుణాలు గురించి తెలుసుకుందాం.

ప్రొద్దున త్వరగా నిద్రలేవలేకపోవడం

సమయాన్ని ఊరికే వృధా చేయడం

మత్తుకు బానిస అవడం లేదా జూదం

బద్ధకంగా కాలాన్ని హరించి వేయడం

'నావల్ల కాదేమో' అనే నిరాశ

'ఎందుకు రిస్క్' తీసుకోవాలి అన్న భయం

నాలో ఎలాంటి ప్రత్యేకతలూ లేవు అని భావించడం

ఆత్మన్యూనతా భావం మొదలైనవి.

బాగా గమనించండి ఇలాంటి వన్నీ లోపాలు కాదు. తప్పులు మాత్రమే. లోపం అంటే సరిదిద్దలేనిది. అవిటితనం లాంటివి. తప్పులంటే సరిచేసుకోగల్గినవి. తప్పకుండా తప్పులను సరిచేసుకోవచ్చు.

'నేను మారాలి', అన్న తీవ్రమైన నిర్ణయమే తప్పులను సరిదిద్దగలదు. ఇటువంటి అతిసాధారణమైన తప్పులను సరిదిద్దుకోవడానికి ఎన్నో వ్యక్తిత్వ వికాస పుస్తకాలు, సినిమాలు, ప్రసంగాలు ఉన్నాయి. వాటిని చదివి, చూసి ప్రేరణ పొందగల్గితే ప్రయత్నం వలన ఖచ్చితంగా ఈ తప్పులన్నీ సరిదిద్దబడుతాయి.

గొప్పవాళ్ళు కావాలంటే గొప్ప పుస్తకాలు చదవండి.

పుస్తక పఠనం ఖచ్చితంగా మిమ్మల్ని క్రొత్తగా తీర్చిదిద్దుతుంది.

ఎనలేని సులభ మార్గాలను మీకు చూపిస్తుంది.

ఇలా సరిచేసుకోగల తప్పులను రోజురోజుకూ సరిదిద్దుకోండి. గెలవాలంటే మారాలి... తప్పదు.

**నిన్ను మార్చగల్గేది ఎవరో తెలుసా... నువ్వే**

**చిట్టచివరి ప్రశ్న**

**అసలు నేను కలగన్న జీవితం నాకు లభిస్తుందా?**

**నమ్మకమే విజయం....**

**సందేహమే అపజయం ...**

'గెలవడానికి మాత్రమే ప్రయత్నించు... గెలుస్తామా లేదా అని తనిఖీ చేసుకోవడానికి ప్రయత్నించకు'. లోపం లేని ప్రయత్నం.. గొప్ప విజయాలను సైతం అలవోకకగా ఇస్తుంది. అసలు నువ్వు కలలు కంటేనే.. నువ్వు కలగన్న జీవితం నీకు లభిస్తుంది. గొప్పగా కోరుకుంటేనే... నువ్వు కోరుకున్నది నీకు లభిస్తుంది. నిరంతరమూ నీ ప్రయత్నము లక్ష్యం వైపే ఉంచు, తప్పకుండా నువ్వుకలగన్న జీవితం లభిస్తుంది. ఇది తథ్యం. ధృడ సంకల్పంతో ప్రయత్నించే వాడిని చూసి ఓటమి ఆమడ దూరం పారిపోతుంది.

**విజయం అనే తృప్తి లేకుండా మరణించకు**

# మీ మనసుకున్న అద్భుత శక్తిని గుర్తించండి

ఈ ప్రపంచంలో అన్నిటికన్నా శక్తివంతమైనది ఏమిటో తెలుసా 'మనసు'. అవును మనసు ఒక సింహాన్ని కూడా జయించగలదు. పెద్ద పర్వతాన్ని కూడా విసిరి పదిమైళ్ళ దూరంలోకి విసరగలదు. మన మనసు అతి గొప్ప ఆలోచనలని సృష్టించగలదు. ప్రతి మనిషి మెదడులో ప్రతి రోజూ కొన్ని వేల ఆలోచనలు వస్తాయి. కానీ సాధారణంగా అందులో 90% నిన్న ఆలోచించినవే మిగిలినవి భవిష్యత్తు గురించినవి. నీ మనసు గారడీలు చేయగలదు. ఉదాహరణకు నువ్వు ఎప్పుడైనా 50 కెజీల బరువుని ఎత్తడానికి ప్రయత్నించావా? ప్రయత్నించి విఫలమయ్యావా? నీకు శక్తి సరిపోలేదా? నీ భార్యముందో లేదా నీ ప్రియురాలిముందో లేకపోతే పరిచయంలేని ఆడవాళ్ల ముందే నీకు ఆ 50 కెజీల బరువును ఎత్తవలసిన పరిస్థితి వస్తే అపుడు నీలో ఏకాగ్రత పెరుగుతుంది. దీర్ఘంగా శ్వాసతీసుకొని నీ నరనరమూ ఉత్తేజితమై ధృడసంకల్పం కల్గి అవలీలగా 50 కేజీలు ఎత్తేస్తావు. 75 కేజీలు అయినా సరే నీకు కష్టం అన్పించదు.

ఎందుకిలా జరిగింది. నువ్వెప్పుడూ ఒకేలా వున్నావు. అదే బలం అదే శరీరం... కానీ ఆడవాళ్ల ముందర పరువు పోతుందనే ఆలోచన మీ మనసులో ఒక భయాన్ని సృష్టించింది. ఎలాగైనా ఆ బరువును ఎత్తితీరాలి అన్న బలమైన ఆలోచన వచ్చింది. ఆ ఆలోచనే నీ శరీరానికి రెట్టింపు బలాన్ని సమకూర్చింది. చూశారా... మనసు ప్రేరణకు గురైతే ఇలాంటి అద్భుతాలు ఎన్నో జరుగుతాయి.

ఇటీవలే వార్తా ప్రతికల్లో ఒక వార్త నన్ను విస్మయానికి గురిచేసింది. ఒక 60 సంవత్సరాల మహిళకు ... తన భర్త గుండె ఆపరేషన్ కోసం డబ్బు కావాల్సి వచ్చింది. ఒక ప్రకటనలో మారథాన్ పరుగుపందెంలో గెలిచిన వారికి 5 వేల రూపాయలు బహుమతి ఇవ్వబడునని చూసి ఏకంగా 25, 30 సం॥ వయస్సు గల యువకులతో పోటీపడి 60సం॥ల వృద్ధురాలు చీరకట్టులో ఆ మారధాన్ పరుగు పందెంలో పాల్గొని అందర్నీ విస్మయానికి గురిచేస్తూ మొదటి స్థానంలో గెలిచింది. ప్రపంచ ప్రజలను నోరెళ్ళబెట్టుకొనేలా చేసింది. ఆమెకు ఆశక్తి ఎలా వచ్చింది. ఖచ్చితంగా అది ఆమె మనోబలమే. బలంగా గెలవాలని కోరుకుంది.... గెలిచింది. ఆమె గురించి తెలుసుకున్న ఎంతోమంది, ఎన్నో సంస్థలు ఎన్నో విరాళాలను ఇచ్చారు. దాదాపు 20లక్షలు పోగయ్యింది. చూశారా మనసు ఎంత ఉద్వృతాన్నైనా సృష్టించగలదు. **తీవ్రమైన గెలవాలనే కోరికే మనల్ని నడిపిస్తుందనేది తిరుగులేని సత్యం.**

గెలవాలన్న కోరిక నిరంతరం నిన్ను దహించాలి. కాంక్ష తీవ్రమైనది. ఐతే క్షణాలు కూడా అద్భుతాలు చేయగలవు.

ఈ సందర్భంలో మీకు ఒక వివరణ ఇస్తాను.

ప్రతి మనిషి తన ప్రమేయం లేకుండా శత్రువుల్ని సృష్టించుకోడు. కానీ నీ ప్రమేయం లేకుండానే అతి ప్రమాదకారి అయిన శత్రువు నిరంతరం నిన్ను జయిస్తూనే ఉన్నాడు. వాడెవరో తెలుసా...

**"నువ్వే"**

అవును నువ్వు ఒకడుకాదు... ఇద్దరు.

ఒకడు బాహ్య ప్రపంచంలో బ్రతికే నువ్వయితే

ఇంకొకడు నీ అంతర్ ప్రపంచంలో బ్రతికే నీలోని నిజమైన మనిషి.

నీకు శత్రువు ఎవరో కాదు ఆ లోపలి మనిషే... ఆ లోపలి మనిషిని నీ ప్రియమైన మిత్రునిగా నువ్వు మలుచుకో లేదా శత్రువుగా మారి నిరంతరం నిన్ను నశింపజేస్తాడు. ఎలా అంటారా...

నువ్వు గొప్ప ఆలోచనలు చేస్తే నీలోని శత్రువు ఇది నువ్వు సాధించలేవు... నీవల్లకాదు... అంటూ నీ ఆలోచనలను హత్యచేస్తాడు.

అందుకే నీలోని భయాలు, సందేహాలు, నిరాశ, బద్ధకం మొదలైన శత్రు సైన్యాన్ని నీ శత్రువుకు సమకూర్చి వాణ్ణి బలవంతున్ని చేయకు. ఆ దుర్మార్గులైన సైన్యంలో ఒక్కొక్కరినే చంపేస్తూ నీలోని చెడు అంతః శత్రువును నిర్వీర్యం చెయ్. చివరికి వాణ్ణి నీ బానిసను చేసుకో. నువ్వు చేసే ఆలోచనలనే వాడు బలపరిచేలా... నువ్విచ్చే సంకేతాలనే వాడు నిర్వర్తించేలా నీలోని అంతఃశత్రువును మార్చుకో.

నీలో ఉన్న ఆ ఇద్దరిలో ఒక్కడే ఆలోచించాలి. ఆ ఆలోచనలే నీ లక్ష్యం కావాలి.

కనుక ప్రతికూల ఆలోచనలు చేసే అవకాశం నీ మనసుకు ఇవ్వకండి. ఎందుకంటే నీ మనసు ఏమి ఆలోచిస్తుందో ఆపనులనే నువ్వు చేస్తావు.

**"బాహ్య ప్రపంచంలో నీ ఉనికి గొప్పగా ఉండాలంటే**
**నీ అంతః ప్రపంచంలో నీవు విజయం పొందాలి"**
**– రాబిన్ శర్మ, మహోన్నత జీవితం.**

# అద్భుతమైన ప్రణాళిక వేసుకోండి

మిత్రులారా మీ లక్ష్యాన్ని గుర్తించడంలోనూ, 'మారాలి' అన్న నిర్ణయం తీసుకోవడంలోనూ, మీ గురించి మీరు తెలుసుకున్న తర్వాత, ఎంతటి గొప్ప లక్ష్యమైనా దాన్ని చేరుకోగలనని మిమ్మల్ని మీరు నమ్మిన తర్వాత ... మీరు ఎంత దూరం వచ్చేస్తారంటే దాదాపు మీ విజయపథంలో పావుదూరం వచ్చేసినట్లే. అవును ఇది అక్షర సత్యం.

ఇపుడు మీరు విజయకాంక్షతో రగిలిపోతారు. మీలోని సాధారణ కోరికను మండే జ్వాలలా చేయండి. మీ కోరికను నిశ్చయమైనదిగా(డెఫినైట్ డిజైర్) మార్చండి. ఒక మండే కోరిక .. మీ విజయానికి కావాల్సిన దారుల్ని త్వరగా మీకు చూపిస్తుంది. మీ కోరిక నిరంతరం ఆరని జ్వాల అయితే ... మీరు విజేతలవుతారు. మీరు మీ పరుగును కొనసాగించడానికి ఇపుడు కావాలి మీకొక వజ్రాయుధం... అతి శక్తివంతమైన అద్భుత ఫలితాలను ఇవ్వగల ఆ ఆయుధం పేరు ప్రణాళిక. మీ లక్ష్యం కోసం మీరు వేసుకొనే ప్రణాళిక మీలో లక్ష్యం పట్ల భయాన్ని, మీరు లక్ష్యాన్ని చేరుకోబోతున్నారన్న ఆనందాన్ని ఇస్తుంది. మీ కోరిక నిజమైనదేనని మీకు గుర్తు చేస్తుంది. కాబట్టి మిత్రులారా మీ గొప్ప ప్రణాళికను వేసుకోవడానికి సిద్ధ పడండి. మీరు ఖచ్చితంగా గెలుపును కోరుకుంటున్నట్లయితే ఒక నిర్దేశకమైన ప్రణాళిక లేకుండా మీరు ముందుకి వెళ్ళలేరు. ఒక వేళ మీ ప్రణాళిక లేకుండానే ప్రయత్నిస్తే... మీరు గమ్యాన్ని చేరుతారనే గ్యారంటీ లేదు.

ఇపుడు ప్రణాళిక ఎలా ఉండాలి... అందులో ఏమి ఉండాలని పరిశీలిద్దాం

మొదట ప్రణాళికకు కావాల్సిన ముడి సరుకులు

1. ఖచ్చితమైన మీ లక్ష్యం
2. మీ లక్ష్యం కోసం మీరు కేటాయించే సమయం
3. మీ పెద్ద లక్ష్యం చేరుకోవడానికి పూర్తి చేయాల్సిన చిన్న లక్ష్యాలు.

**ఖచ్చితమైన మీ లక్ష్యం :** ఒక నోటు పుస్తకాన్ని ఈ ప్రణాళిక కోసం వినియోగించండి. మొదటి పేజీలో నిజమవబోతున్న నా లక్ష్యం ... అని ఖాళీ స్థలంలో మీ లక్ష్యాన్ని పెద్ద అక్షరాలుగా రాయండి. ప్రతిరోజూ దీన్ని చదవండి. ప్రతి రోజూ ఉదయం దీన్ని చదవడం వలన మీ మనసుకు ఇదే నాలక్ష్యం అని ముద్రించబడుతుంది. తర్వాత ఆ లక్ష్యాన్ని సాధించడానికి మనసు, మెదడు రెండూ సమాయత్తమై నీకు సహకరిస్తాయి.

**మీ లక్ష్యం కోసం మీరు కేటాయించే సమయం :** కాలం విలువ, నిముషం విలువ ఇంతకు ముందే నేను చెప్పాను. మరొక్క మారు గుర్తించుకోండి. నిముషాలను గొప్పగా సద్వినియోగం చేసుకోవడానికి తయారవ్వండి. ఒక్క నిముషం నువ్వు ఖర్చు చేశావంటే ఖచ్చితంగా అతి విలువైనది దానికి ప్రతిగా నువ్వు పొందాలి. నువ్వు ఎంత సమయం కేటాయించగలవో నిర్ధారణకు రావాలి.

**గొప్ప లక్ష్యం చేరుకోవడానికి చిన్న లక్ష్యాలు :** మిత్రులారా... ఎన్ని గంటలు కేటాయించాలి అన్నది మీ స్వంత నిర్ణయం. కానీ కేటాయించబడిన కాలం ఖచ్చితంగా, విలువైనది సంపాదించుకొనేలా వినియోగించబడాలి. క్రింది విషయాలను దృష్టిలో ఉంచుకొని మీరు మీ ప్రణాళికను వేసుకోండి.

1. అన్ని ఆలోచనలు చేయాలన్నా, పనిచేయాలన్నా

నూటికి నూరు శాతం మీకు మీ మనసు, శరీరం సహకరించాలి అలా చేయాలంటే ఖచ్చితంగా మీరు వ్యాయాయమో, ధ్యానమో చేయాలి. వీటికి గల ప్రాముఖ్యతను నేను తర్వాత వివరిస్తాను.

2. మీ లక్ష్యం నెరవేరాలంటే మీరు చేయవలసిన రోజువారీ పనులేంటో మీరు తెలుసుకోవాలి. అంటే చిన్న లక్ష్యాలు చేసుకోవాలి. ప్రతి చిన్న లక్ష్యం సంపూర్ణంగా సాధించబడాలి.

3. మీలో మీకు నచ్చని విషయాలు మార్చుకోవడానికి సమయం కేటాయించాలి.

4. మీకు కావాల్సిన అదనపు సామర్థ్యాలను ఉదా:- కమ్యూనికేషన్ స్కిల్స్, కాన్‌సంట్రేషన్, వ్యక్తిత్వం, ప్రవర్తన మొ॥ పెంచుకోవడానికి సమయం కేటాయించాలి.

5. మీ లక్ష్యం నెరవేరినట్లు, గొప్ప స్థితిలో మీరు ఉన్నట్లు ఉండే ఊహల కోసం సమయం కేటాయించండి.

6. గొప్ప పుస్తకాలు, గొప్ప ప్రసంగాలు వినడానికి చదవడానికి ఖచ్చితంగా సమయం కేటాయించండి. నిజం చెప్తున్నా... ఇది నేను మీకు ఇచ్చే అతి విలువైన సలహా. ఖచ్చితంగా ఒక మంచి పుస్తకం మీలో గొప్ప మార్పుని తెస్తుంది.

7. మీ లక్ష్యం నెరవేరడానికి కావాల్సిన మార్గాలను గుర్తించి వాటి గురించిన సమాచారం సంపాదించేందుకు సమయాన్ని కేటాయించండి.

8. రేపు చేయబోయే పనులను ప్రణాళిక వేసుకొనేందుకు

సమయం కేటాయించండి

9. మీ మనసును ఉల్లాసంగా, ప్రశాంతంగా ఉంచుకునేందుకు చేసే పనులకు సమయం కేటాయించండి.

10. ఆ రోజు మీరు ఎలా వినియోగించుకున్నారో... మీ ప్రతి నిముషం మీకు ఏమి ఇచ్చిందో రాసుకోవడానికి సమయం కేటాయించండి. మిత్రులారా... ఇది అతి బ్రహ్మాండమైన తిరుగులేని ప్రణాళిక. ప్రతి రోజూ ఈ ప్రణాళికతో మీరు నడవగల్గితే మీరే విజేతలు.

గుర్తుంచుకోండి ... క్రమబద్ధమైన చర్యలు అర్థవంతంగానూ, పరిపూర్ణమైన ఫలితాలనిస్తాయి. అతి ముఖ్యమైన విషయం... మీరు వేసుకున్న ప్రణాళికను ఎటువంటి పరిస్థితులలోనూ విఫలం కాకుండా పాటించండి. గొప్ప విషయాలను గ్రహించి కార్యరూపంలో పాటిస్తేనే ఏదైనా అద్భుతం జరుగుతుందని తెలుసుకోండి. ఇక మీ పరుగు మొదలెట్టండి. ఒక్క నిముషం కూడా ఆలస్యం చేయకు.

మేరునగ ధీరుడవై ... నీ వజ్ర సంకల్పంతో గుండెల నిండా విశ్వాసాన్ని కల్గిన అపర చాణక్యుడివై, మేధావివై, సవాళ్లను ఎదుర్కొగల సమర్థుడవై ... విజయుడవై ... నీ యుద్ధం ప్రారంభించు... ఈ యుద్దంలో గెలుపే నీ ముగింపు. మీ రోజువారీ లక్ష్యాలను పూర్తి చేయడంలోనూ, మీ రోజువారీ ప్రణాళికను విజయవంతంగా నిర్వర్తించడంలోనూ... మీ కలలను నిజం చేసుకోవడానికి మీరు చేయబోయే కృషిలోనూ మీకు ఎన్నో అడ్డంకులు వస్తాయి. అయ్యో... అడ్డంకులా... అయితే ఇంకెలా? అని ఆలోచిస్తున్నారా...! కష్టాలు, అడ్డంకులూ

లేని నీ పోరాటమూ ఒక పోరాటమేనా అసలు అది యుద్ధమేనా... యుద్ధం అంటే పోరాడాలి. .. పోరాడి గెలవాలి. అలా నువ్వు గెలవాలంటే నువ్వు సమర్థుడవ్వాలి.

ఇక్కడ మీ ప్రణాళికను అపజయం లేకుండా, విఫలం కాకుండా అమలు పరచడమే మీరు చేయబోయే యుద్ధం. ఇందులో మీరు విజయుడవ్వాలంటే మీరు సమర్థుడుగా మారాలి. మీ సమర్థతను పెంచుకొని మీ యుద్దాన్ని గెలవడానికి కొన్ని గొప్ప చిట్కాలున్నాయి. భయపడకు... నమ్మకం ఉంచు.... విజయం నీదే.

నేను మీకు ఇచ్చే సలహా ఏమిటంటే రోజులో ఖచ్చితంగా 360 నిముషాలు అంటే 6 గంటలు నువ్వు పనిచేయగల్గితే అసాధ్యమనేది ఉండదు. కానీ నీకు దొరికే ఈ 360 నిముషాలు అతి గొప్పవి నీ గెలుపును నిర్దేశించేవి.

సమయాన్ని నిర్దేశించుకున్న తర్వాత ఆ సమయంలో నీ లక్ష్యంకోసం నువ్వేం చేయాలనుకుంటున్నావో, ఏ పనికి ఎన్ని నిమిషాలు కేటాయించాలో నిర్ణయించుకో. ఇక్కడ మీకొక ఉదాహరణ ఇస్తాను.

నేను నాకోసం వేసుకున్న ప్రణాళికను మీకు సహాయపడగలదని విశ్వసిస్తూ రాస్తున్నాను.

నేను గొప్ప మోటివేషనల్ స్పీకర్‌గా స్థిరపడాలని నా లక్ష్యం.

నేను ఖచ్చితంగా నా 360 నిముషాలను అంటే 6 గంటలను ఇలా విడదీసుకున్నాను.

1. ఉదయం 5 గం॥ నుండి 5-30 వరకు ధ్యానం - వ్యాయామం

5-30 నుండి 6-30 వరకు పుస్తకాలు చదవడం

6-30 నుండి 7-00వరకు ఆర్టికల్స్ రాయడం

2. ఉదయం 11 గం॥ నుండి మ1-00 వరకు ఇతర భాషలను నేర్చుకోవడం

నాకు కావాల్సిన సమాచారం సేకరించడం

3. సాయంత్రం 7 నుండి రాత్రి 9 వరకు నా కోసం వచ్చిన వారికి సందేశాలు, ప్రసంగాలు ఇవ్వడం, పుస్తకం రాయడం.

నేను కేటాయించుకొన్న ఈ ఆరు గంటలు ఎప్పుడు వృధా చేయలేదు. ఈ 360 నిముషాలను నేను నూటికి నూరు పాళ్ళు వినియోగించుకొన్నాను. నిజం చెప్పాలంటే ఈ ఆరుగంటలు కాకుండా ఇంకా అదనంగా నేను 6 గంటలను గొప్పగా సద్వినియోగం చేసేవాణ్ణి.

## మీ ప్రణాళికను సఫలం చేసేందుకు గొప్ప చిట్కాలు

ప్రణాళిక వెయ్యడం పూర్తయిందా. అయితే ఒక పని చెయ్యండి. ఇంత గొప్ప ముందు అడుగు వేసినందుకు మిమ్మల్ని, మీ మనసుని కృతజ్ఞతగా మెచ్చుకోండి. మీరు వేసుకున్న ప్రణాళికను ఒక్కసారి పూర్తిగా చూసుకొని భవిష్యత్‌లో మీకు విజయాన్ని ఇస్తున్న ముఖ్యమైన పనిముట్టులా దాన్ని చూసి ఉత్సాహంగా కొంతసేపు గడపండి. ఇపుడు మీకు మీరే ఈ గొప్ప ప్రతిజ్ఞ చేసుకోండి.

నేను మిస్టర్ ........................... (ఈ గీతలో మీ పేరు)

నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రుల సాక్షిగా, ఉన్నతమైన నా మేధస్సు సాక్షిగా,
నేను విజయాన్ని సాధించడానికి అవకాశాలనిచ్చే ఈ ప్రకృతి సాక్షిగా,
నా మనస్సాక్షిగా నేను నా లక్ష్యాన్ని నిండా నమ్ముతానని, నా గమ్యాన్ని ఖచ్చితంగా చేరుకుంటానని,
నా జీవిత లక్ష్యాన్ని తప్పకుండా నెరవేరుస్తానని, నా జన్మకు అర్థం తీసుకువస్తానని,
భగవంతుడు నాకివ్వబడిన పనిని సమర్థవంతంగా పూర్తి చేస్తానని,

సమయాన్ని ఏ మాత్రము వృధా చేయకుండా
ప్రతి నిముషాన్ని ఉపయోగించుకుంటానని, గొప్ప జ్ఞాన
సంపద సంపాదిస్తానని...
తప్పకుండా నా దేశానికి, ఈ  ప్రపంచానికి నా యొక్క అతి
గొప్ప కానుకను ఇస్తానని
నిజాయితీగా, ధైర్యంగా, గర్వంగా ప్రతిజ్ఞ చేస్తున్నాను.

**ఈ ప్రతిజ్ఞ మీలో జ్వాలను రగిలిస్తుంది. ఆత్మ విశ్వాసాన్ని పెంచుతుంది.**
**లక్ష్యాన్ని పూర్తి చేయాల్సిన కసిని పెంచుతుంది.**

# గొప్ప చిట్కాలు

## ఆకర్షణ సిద్దాంతం

ఇది సీక్రెట్ అనే గొప్ప పుస్తకం నుండి తీసుకోబడింది. ఈ సిద్ధాంతం మీకెలా ఉపయోగ పడుతుందో ఒకసారి పరిశీలించండి. ప్రతి మనిషి ఒక్క శక్తి క్షేత్రం. ప్రతి మనిషి చుట్టూ ఒక శక్తి క్షేత్రం ఉంటుంది. దీన్నే మనం హ్యూమన్ అరా అంటాం. ఇది మానసికంగా, శారీరకంగా ఆరోగ్యవంతుడైన వ్యక్తి చుట్టూ 4 అడుగుల దూరం వరకు వ్యాపించి ఉంటుంది. ఈ శక్తి ద్వారా మన ఆలోచనలు ఈ విశ్వంలోకి ప్రసరింప జేయబడుతాయి. ఇలా ప్రసరింపజేయబడిన ఆలోచనలు దానికి సమానమైన శక్తిని తిరిగి మీకు చేర్చబడుతుంది. మీరు ఈ విశ్వంలోకి మంచి ఆలోచనలు ప్రసరింపజేస్తే.. ఈ శక్తి తప్పకుండా తిరిగి మంచినే మీకు చేరుస్తుంది. ఒక వేళ చెడు ఆలోచనలను ప్రసరింపజేస్తే ... చెడు మీ వైపు ఆకర్షించ బడుతుంది. ఉదాహరణకు మీరొక గొప్ప పుస్తకం కోసమో, గొప్ప రచనల కోసమో అన్వేషణ ప్రారంభించారనుకోండి... మంచి పుస్తకాలు కావాలి అనే కోరిక, ఆలోచనలను ఈ విశ్వంలోకి ప్రసరింప జేయబడుతుంది. వెంటనే మన శక్తి క్షేత్రం తిరిగి మనకు గొప్ప పుస్తకాలు దొరికే మార్గాలను ఎన్నోదారులను ఇలాంటి ఆలోచనలే ఉన్న వ్యక్తులను మీకు దొరికేలా చేస్తుంది. అంటే మీరు తీవ్రంగా దేన్ని కోరుకుంటారో.. అది దొరికేదారులు మీకు దగ్గరవుతాయి.

ఆశ్చర్యంగా! మీకు కావాల్సిన గొప్ప సాహిత్యం అతి త్వరలోనే మీకు దొరుకుతుంది. అదే.. మీరు చెడు సాహిత్యం గల పుస్తకాల కోసం కోరుకుంటే... అవి దొరికే దారులే మీకు కన్పిస్తాయి. చివరకు చెడు పుస్తకాలే మీకు దొరుకుతాయి. ఇదే ఆకర్షణ సిద్ధాంతం.

మీరు మంచిని ఆకర్షిస్తే మంచే మిమ్మల్ని ఆకర్షిస్తుంది. చెడును ఆకర్షిస్తే చెడు మాత్రమే తిరిగి మిమ్మల్ని ఆకర్షిస్తుంది. అందుకే ఎపుడూ మీకు విజయం కావాలనే ఆలోచనలనే ప్రసరింపజేయండి. ఖచ్చితంగా మీ విజయానికి దారులు వాటంతట అవే మీ దగ్గరకు వస్తాయి. ఈ సిద్ధాంతం సృష్టిలో అతి గొప్ప విజయరహస్యాల్లో ఒకటి ఎన్నో దేశాల్లో ఈ సిద్ధాంతం వలన ఎంతోమంది వాళ్ల జీవితాలనే మార్చుకున్నారు. 4వేల సంవత్సరాల నుండి ఎంతో మంది విజేతలు, మహాత్ములు అనుసరిస్తున్న అతిగొప్ప రహస్యమిది. ఖచ్చితంగా మీరు దీన్ని నమ్మండి... పాటించండి అద్భుత విజయాలను సొంతం చేసుకోండి. ఎటువంటి పరిస్థితులలోనూ నిరాశాకరమైన ఆలోచనలు చేయకండి. ఏ సమయంలోనైనా ఇటువంటి నిరాశాజనకమైన ఆలోచనలు వస్తే... వాటిని వెంటనే చంపెయ్యండి. వాటి స్థానంలో మీకు ఆనందాన్ని, అనుకూలతను కల్గించే ఆలోచనలు చేయండి. ఇది నిజం. ఖచ్చితంగా ఈ పద్ధతి మీకు గొప్ప ఫలితాన్నే ఇస్తుంది. ఈ ఆకర్షణ సిద్ధాంతం గురించిన సీక్రెట్ అనే పుస్తకమే..

పరోక్షంగా నన్ను ఎంతో ప్రభావితం చేసింది. నాలో గొప్ప మార్పును తెచ్చిందని చెప్పడానికి నేను గర్వపడుతున్నాను. మిత్రులారా అందుకే పొద్దున లేవగానే ఈ రోజంతా అద్భుతంగా గడవాలని కోరుకోండి... ఆశ్చర్యంగా మీకు అద్భుతమైన సంఘటనలు, పరిస్థితులే మీకు ఎదురవుతాయి. అంతేకానీ, ప్రొద్దున లేవగానే అయ్యో ! ఈ రోజు ఎలా వుంటుందో ఏమో... అని ఎటువంటి పరిస్థితుల్లోనూ అనుకోకండి. ఇలా అనుకుంటే ఆ రోజంతా మీకు ప్రతికూల వాతావరణమే ఎదురౌతుంది. చూశారా.... గొప్ప ఆలోచనలు చేసే అద్భుతాలు. అంతా మీ చేతుల్లోనే ఉంది. మంచి జరగాలన్నా, చెడు జరగాలన్నా అంతా మీరే నిర్ణయించుకోగలరు. నిద్రలేచిన దగ్గరినుండి ప్రతిక్షణం మీ విజయాన్నే కోరుకోండి. ప్రతి క్షణం మంచి జరగాలనే, మంచి జరుగుతుందనే కోరుకోండి. ఖచ్చితంగా మీరు కోరుకున్నది లభిస్తుంది. ఎందుకంటే మనం చేసే ఆలోచనలే మన జీవితాన్ని నిర్ణయిస్తాయి.

పాజిటివ్ థింకింగ్ మరియు మిమ్మల్ని మీరు మార్చుకోవడానికి అవసరమైన ఎన్నో గొప్ప పుస్తకాలు మీకు దొరుకుతాయి. ప్రతి రోజూ వేకువ జామునే ఈ మంచి పుస్తకాలను చదవండి. మీ గుండెల్లో ఆశను పెంచుకోండి. గొప్పగా కోరుకోండి. కోరుకున్నది సాధించండి. మిమ్మల్ని మీరు మార్చుకొని ఈ ప్రపంచానికి ఉపయోగపడండి.

## మీ మెదడులోని చెత్తను శుభ్రం చెయ్యండి

అవును మీ మెదడు లెక్కలేనంత చెత్త విషయాలతో నింపుకుంటారుమ మీరు. ఒక మనిషి రోజుకు 60 వేల ఆలోచనలు చేస్తాడని గణాంకాలు చెబుతున్నాయి. కానీ ఇవన్నీ క్రితం రోజో లేదా రేపటికి సంబంధించినవే. చూశారా.. ఇంత చెత్తను నింపుకుంటే ఇక మంచి ఆలోచనలు నింపుకునే స్థలమేదీ?

ఒకసారి ప్రఖ్యాత శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ ను ఒక జర్నలిస్టు ఒక ప్రశ్న వేశాడు. పదిమైళ్ళకు ఎన్ని అడుగులు వస్తాయి సార్? అని. ఆయన అపుడు ఇలా సమాధాన మిచ్చాడు. ఏ క్యాలిక్యులేటర్ ఉపయోగిస్తే ఒకే నిముషంలో నీకు సమాధానం లభిస్తుంది. ఇటువంటి అనవసరమైన చెత్తను నా బుర్రలో నింపుకోవడం నాకిష్టం లేదు అని జవాబిచ్చాడు. చూశారా... విజేతలంటే అలాగే ఉంటారు. మీరు కూడా కాబోయే విజేతే. పనికిరాని ఆలోచనలను, అనుమానాలను, భయాలను మీ మెదడులో నింపుకోకండి. గొప్పగా ఊహించగల ఆలోచనలకు స్థలం ఉండనివ్వండి. మీకలలకు స్థలం ఇవ్వండి. మీ లక్ష్య సాధనకై మీరు చేసే ఆలోచనలకు స్థలాన్ని కేటాయించండి. మీ మెదడును గొప్పగా వాడుకోండి.

ఈ ప్రపంచంలోని జ్ఞానాన్ని, సాహిత్యానంతా మీరు తెలుసుకోనక్కరలేదు. కేవలం మీకు పనికివచ్చే, మీ గెలుపుకు పనికి వచ్చే జ్ఞానం మాత్రం మీరు మీ మెదడులో

నిక్షిప్తం చేస్తేచాలు. ఒక్కోసారి తెలివైన జ్ఞానులు కూడా ఓటమి పాలవుతూ ఉండడానికి కారణం... అవసరం లేని చెత్తను తమ మెదళ్ళలో నింపుకోవడం. ఒక్కసారి మీ మనసుకు శిక్షణ నివ్వండి. మంచి ఆలోచనలే చేయమని. అటువంటి ఆలోచనలే మెదడులో నిక్షిప్తం చేయమని. ఈ శిక్షణలో విజయం సాధించారంటే మీ మెదడు ఓశక్తి క్షేత్రం అవుతుంది. ఈ మనసుకు ఇచ్చే శిక్షణకు చిన్న చిట్కా ఆకర్షణ సిద్ధాంతాన్ని ఉపయోగించుకొని మంచి సమాచారాన్నే సేకరించండి.

**మీ అంతరాత్మ చెప్పింది వినండి**

మీరు మీ చెయ్యబోయే పనులను ఎలా ఎన్నిక చేసుకుంటారో తెలుసా...? ఏ పని చేయాలో మీకు మీ అంతరాత్మ ముందుగానే చెబుతుంది. మీరు చేయబోయే పని మంచిని చేస్తుందా, చెడును చేస్తుందా అని మీ అంతరాత్మ మీకు చెబుతుంది. జాగ్రత్తగా మీ అంతరాత్మ సంకేతాలని వినండి.

**ఉదా :** మీకు ధూమపానం లేదా మద్యపానం అలవాటు ఉంటే అది చేయబోయే ముందే ఒక్కసారి ఒక్క క్షణం ఆలోచించండి. మీలో చిన్న సంశయం... ఆరోగ్యానికి హాని అనే సంశయం కలుగుతుంది. ఇది మీకు మీ అంతరాత్మ ఇచ్చే సంకేతం. మీరు చీకట్లో నడుస్తుంటే... ఒక రకమైన భయం మిమ్మల్ని ఆవహిస్తుంది. ఇది మీ అంతరాత్మ మీకిచ్చే సంకేతం. మీరు బైక్‌మీద అతి వేగంగా వెళ్తున్నపుడ మీ

లోపల 'అతివేగం వద్దు' ... వద్దు అనే హెచ్చరిక వస్తుంది. ఇది మీ అంతరాత్మ ఆ పని చెయ్యకు అని మీకిచ్చే సంకేతం. మిత్రులారా... బాగా అర్థం చేసుకోండి మీరు మంచి పనులు మంచి ఆలోచనలు చెయ్యబోతే మీ అంతరాత్మమీకు సంతోషాన్నిస్తుంది. చెయ్యమని చెబుతుంది. మీరు చెడు ఆలోచనలు ధైర్యంగా చెయ్యలేరు ఎందుకంటే అంతరాత్మ వద్దని వారిస్తూ ఉంటుంది. మీరు మీ అంతరాత్మ చెప్పేది వినండి. మీ అంతరాత్మ మంచిని చాలా నెమ్మదిగా... చెడును చాలా వేగంగానూ మీకు తెలియజేస్తుంది. ఈ తేడాను అనుభవించండి. మంచి పనులే.... మంచి

**మిమ్మల్ని కృంగదీసే విషయాల నుండి బయటపడండి**

ప్రతి మనిషికి నిరంతరం కొన్ని విషయాలు ఎంతగానో నిరాశకు, దుఃఖానికి కారణాలవుతాయి. అప్పులు, అవసరమైన డబ్బు లేకపోవడం, అనారోగ్యం, మతిమరుపు, ఏ పనినీ సమర్థవంతంగా సాగించలేక పోవడం, ప్రోత్సాహం కరువవడం, కుటుంబ కలహాలు, లక్ష్యమంటూ ఏదీ లేకపోవడం, ఆత్మనూన్యతా భావం ఇలా చెప్పుకుంటూ పోతే అవకాశమివ్వాలేగాని మీ నెత్తిమీద బోలెడు సమస్యలు వచ్చి శివతాండవం చేస్తాయి. అనివార్యమైన ఇలాంటి కొన్ని సమస్యల నుండి ఎలా బయటపడాలి అన్నదే ప్రశ్న. దీనికి బ్రహ్మాండమైన దారి ఉంది.

గొలుసు పద్ధతి అవును ఈ పద్ధతి ద్వారా అతి గొప్ప ఫలితాలు వచ్చాయి. ఒకసారి ఇది చదవండి ...

**అప్పులు ఎలా వస్తాయి ..... తృప్తి లేకపోతేనో లేక చాలినంత డబ్బు లేకపోవడం వలనో...**

**కావల్సినంత డబ్బు ఎందుకుండదు.... ఏ పనీ లేకుండా ఉండటమో లేక... ఉన్న పనిలో వచ్చేది చాలకనో....**

**ఏ పనీ ఎందుకు ఉండదు... నీవు చాలా అసమర్థుడవుని నీవు అనుకున్నపుడో లేక చేయడానికి అవకాశాలు రాకపోవడవం వలనో....**

**అవకాశాలు ఎందుకు రావు... నువ్వు ప్రయత్నించక పోవడం వలనో లేక ... నువ్వు అదృష్టాన్ని నమ్ముకోవడవం వలనొ ...**

**నువ్వెందుకు ప్రయత్నించవు... నీకు ఏ లక్ష్యమూ లేక పోవడం వలనో లేక నీపై నీకు ఆత్మ విశ్వాసం లేకనో.... ఆత్మవిశ్వాసం నీకు ఎందుకు లేదు ... నిన్ను నువ్వు నమ్మలేకపోవడం వలనో.. లేక అనారోగ్యంవలనో...**

**అనారోగ్యం ఎందుకు వస్తుంది... ఇన్ని సమస్యలు ఉండటం వలనో లేక ... నీ అలవాట్ల వల్లనో...**

**ఇన్ని సమస్యలు ఎందుకువస్తాయి... నువ్వెప్పుడూ సమస్యల గురించి ఆలోచించడం వలన.**

ఏమిటీ? కేవలం ... సమస్యల గురించి ఆలోచించడం వలన ఇన్ని సమస్యలు వస్తాయా? అలా

ఆలోచించడం మానేస్తే సమస్యలు రావా? ఇదేగా మీ ప్రశ్న.
**ఖచ్చితంగా రావు ... ఖచ్చితంగా రావు ...**

ఈ ప్రపంచంలో సమస్యలను తనకు తానుగా తయారుచేసుకోగల గొప్ప జంతువు ఎవరో తెలుసా?

**'మనిషి'**

ఎందుకు? మనిషి ఆలోచించగలడు కాబట్టి. అదీ కాకుండా సమస్యల గురించి తీవ్రంగా ఆలోచించగలడు కాబట్టి. సమస్యల గురించి ఆలోచించడం మానేస్తే ... సమస్యలు తీరకపోవచ్చు. కానీ ఆ సమస్యలు తీరగల మార్గాలు కన్పిస్తాయి. అవును ఇది నిజం. సమస్య గురించి ఆలోచిస్తే మరిన్ని సమస్యలు మీ పై దాడి చేస్తాయి. ఉదాహరణకు  మీరు ఆఫీసుకు లేట్‌గా వెళ్లారనుకోండి. మీ బాస్ ఉద్యోగంలోంచి తీసేస్తారని భయపడతారు. దీని గురించి ఆలోచించడం మొదలు పెడతారు.

ఒక వేళ నాకు ఉద్యోగం పోతే ఎలా? నా ఇంటిని ఎలా నెట్టుకు రావాలి, పిల్లల చదువులెలా, .. నాన్న ఆరోగ్యం సంగతి ఎలా... నేను సరైన వైద్యం చేయించకపోతే... ఆయన జీవితం ఏమౌతుందో.. తల్లి, తండ్రిని, భార్యా బిడ్డలను సుఖపెట్టలేని అసమర్థుడిగా మిగిలిపోతానేమో... ఈ ఆలోచన మీకు గుండెపోటును కూడా రప్పించగలదు. చూశారా... ఆఫీసుకు లేటుగా వెళ్ళడం అనే సమస్య చివరికి గుండెపోటు వచ్చేదాకా... ఎన్ని సమస్యలు పుట్టించిందో...

అదే సానుకూలంగా ఆలోచించండి.. ఇలా...

**ఉద్యోగం పోతే ఏంటి... నాకు నా ఇంటికి పెయింటింగ్ వేయడం వచ్చుగా.. కష్టపడి రెండు కాంట్రాక్టులు తీసుకుంటాను. కష్టపడి పనిచేస్తాను. నాకు వచ్చిన పనినే క్రియేటివ్‌గా చేసి త్వరలోనే గొప్ప పెయింటింగ్ కాంట్రాక్టర్ అవుతాను. అలా కాంట్రాక్టరయితే నాకు బాగా డబ్బు వస్తుంది. సొంత కారు, ఇల్లు కొనుక్కుంటాను. నాకు నచ్చిన పనిని చేసుకుంటూ ఎవడిక్రిందా పనిచెయ్యకుండా గర్వంగా బ్రతుకుతాను.**

ఇంకా... ఇలా ఒక సానుకూలమైన ఆలోచన... గొప్పవైన ఎన్నో ఆలోచనలని సృష్టించగలదు. మిత్రులారా... కఠోరమైన నిజం చెప్తాను. కొన్ని ప్రయత్నించి చేస్తేనే కొన్ని లభిస్తాయి. మారాలన్న ఆలోచన చెయ్యి... మారగలవు. ఈ ఆలోచనే గొప్ప లక్ష్యాలని నిర్దేశిస్తుంది. గొప్ప లక్ష్యం కోసం పనిచేసే వాడికి కావాల్సినవి అన్నీ దొరకుతాయి. సమస్యల గురించి ఆలోచించకు... ఒక వేళ సమస్య వస్తే... దాని నిర్మూలించగల మార్గాలను వెదుకు... ప్రయత్నం వలన సర్వం సిద్ధిస్తుంది.

ఇలా **ఆరోగ్యంగా ఉండటం వలన - ఆత్మ విశ్వాసాన్ని ఆత్మవిశ్వాసం వలన - లక్ష్యాన్ని లక్ష్యం వలన - ప్రయత్నాన్ని ప్రయత్నం వలన - అవకాశాలను అవకాశాలవలన - డబ్బును డబ్బు వలన - సంతోషాన్ని సంతోషాల వలన - ఆనందాన్ని** ఇలా అన్నీ గొలుసు కట్టులా ఉన్న ఈ ప్రక్రియలను సాధించవచ్చు.

## మీ దేహాన్ని ఆరోగ్యంగా ఉంచుకోండి

చాలా మంది కళాకారులు పరిపూర్ణమైన ఆయుష్షును పొందుతూ ఉండటం గమనించండి. ఎందుకు ...?

ఎవరి మనసైతే నిత్యం రంజింపబడుతూ ఉంటుందో వాళ్ళు నిండా నూరేళ్ళు ఆరోగ్యంగా బ్రతుకుతారు. దీనివల్ల మనకేం అర్థమవుతోందంటే మనసును ఆనంద డోలికల్లో ముంచినంత కాలం మన ఆరోగ్యానికి వచ్చిన ఢోకా ఏమీ లేదు. బాగా గుర్తించుకోండి మీరు మీ లక్ష్యాన్ని చేరుకున్న తర్వాత.. 'దాన్ని' ఆనందించాలి, అనుభవించాలి అంటే మీరు ఆరోగ్యంగా ఉండాలి. ఈ రోజుల్లో 60సం॥ రాగానే మిగిలిన సహోద్యోగులో, సహమిత్రులో చెప్పినవి వింటుంటారు. ఏమిటంటే ... 60 సం॥లు రాగానే బి.పి., షుగర్ వస్తాయని, ఎముకల్లో బలం తగ్గిపోతుందని, గుండె జబ్బులు వస్తాయని ముందే హెచ్చరిస్తూ ఉంటారు. దీనివలన బాహ్య ప్రపంచపు అపోహలతో కూడిన ప్రేరణలు మనిషిని నిలువునా మోసం చేస్తున్నాయి. ఎటువంటి జబ్బులేని 60 సం॥ వృద్ధుడు తనకి 61వ సం॥రాగానే తన మిత్రులు చెప్పిన రోగాలన్నీ వస్తాయోమోనన్న భయం, అనుమానంతోనే లేని రోగాలను కొని తెచ్చుకొని బంగారం లాంటి ఆరోగ్యాన్ని పాడు చేసుకుంటున్నాడు.

మిత్రులారా మనిషి ఆయుష్షు అక్షరాలా వంద

సంవత్సరాలు. ప్రతి రోజూ నువ్వు ఆరోగ్యంగా ఉన్నావని ఎప్పటికీ ఆరోగ్యంగా ఉంటానని నమ్ము.. ఏ రోగం నీ దగ్గరికి రాదు. ఇది నిజం. యవ్వనంలో ఎంత శక్తితో జీవిస్తావో వయసు పై బడినపుడు కూడా అంతే శక్తిగా ఉండాలని వుంటే.. ప్రతి రోజూ వ్యాయామం, ధ్యానం తప్పనిసరి ఈ విషయం ప్రపంచం అంతా కోడై కూస్తోంది. అయినా ఎపుడూ ఉత్తేజంగా, శక్తివంతంగా, ధీరుడిగా, ఆరోగ్యంగా, యవ్వనం ఉండాలి అంటే... రోజుకు కనీసం 30 నిముషాలు ఆటలో లేక వ్యాయాయమో, ధ్యానమో చెయ్యండి. దీని గురించి ఇంక ఏమీ చెప్పాల్సిన అవసరం లేదు. నిన్ను నువ్వు ఆరోగ్యంగా ఉంచుకోవడం నీ ప్రాథమిక విధి. ఎందుకంటే పెద్దలు ఆయురారోగ్య ఐశ్వర్య ప్రాప్తిరస్తు అని ఎందుకు దీవిస్తారంటే ఆరోగ్యము లేని ఆయుష్షు, ఆయుష్షులేని ఐశ్వర్యం, ఐశ్వర్యము లేని జీవితము వ్యర్థమని. **ఆరోగ్యంతో ఆయుష్షును ఆయుష్షుతో ఐశ్వర్యాన్ని, ఐశ్వర్యంతో మంచి జీవితాన్ని సంపాదించి పరిపూర్ణుడవ్వమని దాని అర్థం.** ఈ ప్రపంచంలో సంపూర్ణ ఆరోగ్యవంతుడి కన్నా అదృష్టవంతుడు మరెవ్వరూ లేడు.

**ఆరోగ్యమే ... మహా భాగ్యం.**

**ఉల్లాసంగా గడపండి**

జీవితం చాలా చిన్నది. ఏ పని వల్ల మనిషికి నిస్సత్తువ, టెన్షన్ రాకూడదు. చివరికి నీ గొప్ప లక్ష్యమైనా సరే అది నీ మెదడును విపరీతమైన ఒత్తిడికి గురి చేయకూడదు.

**జీవితం అంటే నీ లక్ష్యం ఒక్కటే కాదు.. జీవితం కూడా ...**

సంతోషంగా నీ జీవితాన్ని అణువణువూ ఆనందించి అనుభవించు. అన్ని సమకూరిన తర్వాత తీరిగ్గా కూర్చొని ఉల్లాసంగా గడపొచ్చులే అని అనుకుంటున్నారా... అది మీ అమాయకత్వం... ఈ లోగా... మన చేతిలో లేనిదీ ... మనం ఎదిరించలేనిదీ ... మనల్ని కమ్మేయవచ్చు... అది మృత్యువు అవును చావు మనచేతుల్లో లేదుగా... అందుకే జీవితం ఉన్నంతకాలం ...

ప్రతి నిముషమూ ఉల్లాసంగా గడుపు అదే నీకు చివరికి మిగిలే ఆస్తి. అదెలా సాధ్యం..? సీరియస్‌గా నేను లక్ష్యం కోసం పోరాడాలా ప్రతి నిముషమూ ఉల్లాసంగా గడపాలా? అని ఆలోచిస్తున్నారా! లక్ష్యం సాధించమంటే మొహం చిట్లించుకొని, భృకుటిని ముడివేసి.. అతి ఏకాగ్రతతో ఒక సైకోలా పనిచెయ్యనవసరం లేదు. నువ్వు చేసే ప్రతి పనిలోనూ ఉల్లాసాన్ని చొప్పించు.మంచి సంగీతం విను. నవ్వు పుట్టించే హాస్యాన్ని చూడూ..

**నవ్వడం ఒక యోగం...**
**నవ్వించడం ఒక భోగం...**
**నవ్వలేక పోవడం ఒక రోగం. అన్నారు జంధ్యాల గారు.**

ఉల్లాసంగా గడపడం మీ శరీరాన్నీ మనసును మెదడును మరింత ఉత్తేజం చేస్తుంది. మీరు ఎంత కష్టపడినా ఉల్లాసంగా పనిచేయడం వలన ఆ కష్టమే మీకు తెలియదు. అయినా... ఎప్పుడూ సీరియస్‌గా.. ముభావంగా పనిచేసి విజయం సాధించడం బావుంటుందా? లేక నవ్వుతూ తుళ్ళుతూ ఉల్లాసంగా పది మందిని నవ్విస్తూ... ఏదో ఒక ఆటలా పనిచేసి విజయం సాధించడం బావుంటుందా. ఉల్లాసం అనేది. మీ బిజీ లైఫ్‌కు శక్తి నిస్తుంది.

ఈ సమాజంలో అందరూ నవ్వుతూ, ఉల్లాసంగా ఉండేవాళ్లనే ఇష్టపడుతారు. ఎప్పుడూ సీరియస్‌గా, మౌనంగా ఉండేవాళ్ళను అసహ్యించుకుంటారు. మిత్రులారా ...! మీ దినచర్యలో మీ పనులు సజావుగా, సమర్థవంతంగా కొనసాగాలంటే ఉల్లాసంగా గడపడానికి సమయం ఖచ్చితంగా కేటాయించుకోండి. ఎందుకు చెబుతున్నానంటే ... గొప్ప లక్ష్యం కోసం పనిచేసే క్రమంలో విపరీతమైన ఒత్తిడికి గురవుతారు. ఈ ఒత్తిడిని ఎప్పటి కప్పుడు తగ్గించు కోకపోతే.. తర్వాత ఏ మాత్రము పని చేయలేని మానసిక స్థితికి చేరుకుంటారు. అందుకే ప్రతి పనినీ... ఉల్లాసంగా, చల్లగా చేయండి. ఇలా ప్రతిరోజూ బ్రతకగలిగితే మీ అంత అపార అదృష్టవంతులు ఈ సృష్టిలో ఎవరూ ఉండరు. మనసుకు ఉల్లాసాన్ని ఇచ్చేవి ఈ ప్రకృతిలో చాలా వున్నాయి. ఉదయం .. సూర్యోదయాన్ని చూస్తూ... ఆస్వాదించండి. అపుడు వీచే అద్భుతమైన చల్లనిగాలిని ఆస్వాదించండి. మంచి సంగీతం వినండి. చిన్నపిల్లలతో సమయం గడపండి. జోక్స్ చదవండి... చూడండి. (సెన్స్ ఆఫ్ హ్యూమర్) హాస్య చతురతను

పెంచుకోండి.

ప్రతి రోజూ అద్దం ముందు 5 నిముషాలు నిల్చుకొని మిమ్మల్ని మీరు చూసుకుంటూ పిచ్చిగా నవ్వుకోండి. నీలాకాశాన్ని తెరిపారా గమనించండి. పువ్వుల్ని, తుమ్మెదల్ని ఆసక్తిగా గమనించండి. భగవంతుని విగ్రహాన్ని కన్నార్పకుండా చూడండి. మీకు నచ్చినవి సంతోషంగా చెయ్యండి. మళ్ళీ చెబుతున్నా..

**జీవితం ఒక్కసారే వస్తుంది. ఈ ప్రపంచం ఎంత ఇస్తుందో.. అంతా తీసుకో... అన్ని విధాలా నీ జీవితాన్ని పరిపూర్ణం చేసుకో.**

## సృజనాత్మకత (CREATIVITY) ని ఉపయోగించండి

క్రియేటివిటిని ఉపయోగించమంటే ప్రపంచంలో ఇంత వరకూ లేని విధంగా క్రొత్తది కనిపెట్టాలని కాదు. నీకు తెలిసిన పనిని సరికొత్త పద్ధతిలో చెయ్యడం. గొప్ప వాళ్ళంతా సాదారణమైన పనుల్నే చేశారు కాకపోతే వారికంటూ ఓ వినూత్నమైన కొత్తపద్ధతిలో చేశారు, ఒక ప్రత్యేకమైన పద్ధతిలో చేసారు. మీరు ఒక గొప్ప లక్ష్యం కోసం ప్రయత్నిస్తున్నపుడు ఎంతో పోటీ ఉంటుంది.

ఒక వ్యాపారాన్ని అత్యున్నత స్థాయిలో చెయ్యాలన్నా ఒక గొప్ప రచయిత కావాలన్నా మరే లక్ష్యమైనా సరే ప్రస్తుత ప్రపంచంలో ఎంతో పోటీ ఉంది. ఈ పోటీలోంచి ప్రపంచం మిమ్మల్ని ప్రత్యేకంగా గుర్తించాలంటే మీరు పనిచేసే తీరు, ప్రయత్నించే తీరు సరికొత్తగా ఉండాలి. ఈ ప్రపంచం ఎవర్ని గుర్తిస్తుందంటే సాదారణమైన పనుల్నే అసాధారణమైన

ప్రత్యేకతతో చేసిన వాళ్ళని. మీ లక్ష్యసాధనలో మీరు ఎన్నో పనుల్ని చేయవల్సివస్తుంది. పాత పద్ధతుల్ని కాకుండా మీకంటూ ఓ ప్రత్యేక విధానాన్ని తయారు చేసుకోండి. ఎందుకంటే ఈ ప్రపంచం ఎపుడూ క్రొత్తదనాన్నే కోరుకుంటూ ఉంటుంది. ఒక పనిని ఎంతో ప్రత్యేకంగా చేసే వారికై ఈ ప్రపంచం ఎదురుచూస్తోంది. ఎందుకంటే మీరు నంబర్‌వన్‌కావాలంటే ఒక విషయం గుర్తుపెట్టుకోండి. అలా నెంబర్ వన్ కావాలని మీతోపాటు కొన్ని వేల మెదళ్ళు ఆలోచిస్తున్నాయి. ఇన్ని వేళ మెదళ్ళలో అదేపనిని క్రియేటివ్‌గా ఎలా చేయాలి. అని ఆలోచించగల్గే మెదడే మొదటిస్థానాన్ని ఆక్రమిస్తుంది. ఒక పనిని ఒకే కోణంలో చెయ్యవచ్చా! లేదంటే మరో కోణంలో చేయడానికి మార్గం ఏదైనా ఉందా.

ఇలా మరో కోణంలో ఆలోచించగల్గేవాడే అతి త్వరగా విజయానికి చేరువవుతాడు. మనం ఈ రోజు ఆహార పదార్థాలుగా వినియోగిస్తున్న ఇన్‌స్టంట్ కాఫీ, ఇన్‌స్టంట్ నూడుల్, ఇన్‌స్టంట్‌పాలు .. ఇవన్నీ ఇలా ప్రత్యేక కోణంలో ఆలోచిస్తే వచ్చినవే. దీనికి సంబంధించిన ఒక చిన్న సందర్భం చెబుతాను. నాకొక స్నేహితుడు ఉన్నాడు. అతను సినిమా డైరెక్టర్ కావాలని ప్రయత్నిస్తున్నాడు. మామూలుగా ప్రయత్నించకుండా తనో వినూత్న పద్ధతి ఎన్నుకున్నాడు. అదేమిటంటే తను తీయబోయే సినిమా కేవలం ఒక్క రూపాయికే నేను ప్రేక్షకుడికి అందిస్తానని తను అన్నాడు. అదెలా సాధ్యం అంటే ఇలా వివరించాడు. ఈ రోజుల్లో ప్రతి ఒక్కరి దగ్గరా సెల్ ఫోన్ ఉంది. అంతేగాక సెల్ ఫోన్‌లో బోలెడు వీడియోలు డౌన్‌లోడ్ చేసుకుంటున్నారు.నా సినిమాను ఒక్కరూపాయి పెట్టి

సెల్‌ఫోన్‌లలోకి డౌన్‌లోడ్ చేసుకొనే వెసులుబాటు కల్పిస్తాను. దీనివలన నాకు సినిమా పబ్లిసిటీ వస్తుంది. జనాలందరికీ అందుబాటులోకి వస్తుంది అని ప్రయత్నిస్తే ఈ పద్ధతి చాలా బాగా పనిచెయ్యవచ్చు.

మిత్రులారా... ! మీకున్న ప్రత్యేకత మీ విశిష్టాన్ని చాటుతుంది. ప్రపంచంలో ఒక్కడిగా నిలబెడుతుంది. మీకు అలవాటు లేకపోతే అలవాటు చేసుకోండి. మీరు మామూలుగా చేసే చిన్న చిన్న పనులనే వైవిధ్యంగా చేయ్యడం ప్రయత్నించండి. **ప్రయత్నంగెలిచే సంభావ్యతను వెదుకుతుంది.** గుర్తుంచుకోండి, నీ లక్ష్యాన్ని వైవిధ్యంగా సాధించ గల్గిన మొదటి వ్యక్తి మీరే కావాలి.

**చిన్న లక్ష్యాలను సమర్థవంతంగా పూర్తి చెయ్యండి**

ఒక తాపీ మేస్త్రీ ఒక ఇళ్లు కట్టడానికి మొదట పునాది వేస్తాడు. ఆ తర్వాత ఆ పునాదిపై ఇటుక వరుసలతో గోడకట్టడం మొదలు పెడతాడు.అతను పెట్టే ప్రతి ఇటుకలోనూ పూర్తవ్వబోయే ఇంటిని చూస్తాడు. అలా చూస్తేనే.. ప్రతి ఇటుకా సరైన స్థానంలో నిలబడుతుంది. ఒక్క ఇటుక వరుస కొంచెం దిశ మారినామొత్తం గోడ సొట్టగా నిర్మితమౌతుంది. అందుకే ప్రతి ఇటుక వరుసనూ ఎంతో జాగ్రత్తగా కొలతలు చూసుకొని, ఒద్ధికగా.. అదే శ్రద్ధతో పేరుస్తాడు మేస్త్రీ. ఈ సంధర్భంలో మీరు తెలుసుకోవల్సిందేమిటంటే, మీరు మీ లక్ష్యం అనే ఇంటిని కలల్లో కట్టుకున్నారు. ఒక ప్లానింగ్ ప్రకారం పూర్తి చేయాలనుకున్నారు. దీని కోసం ప్రతి రోజూ కొంత ఇటుక వరుసను మీరు కట్టాల్సి వుంటుంది. ఆ ఇటుక వరుసలే మీరు

చేయబోయే చిన్న లక్ష్యాలు. ప్రతి చిన్న లక్ష్యాన్ని.. పునాది కట్టినపుడు ఎంత శ్రద్ధగా చేస్తారో... ప్రతి వరుసా అంతే శ్రద్ధగా కట్టినట్లు పూర్తి చేయండి. ఇలా ప్రతి చిన్న లక్ష్యం సరిగ్గా, పరిపూర్ణంగా పూర్తి చేసు కుంటూపోతే కొన్నాళ్ళకు మీ కలల సౌధం.. మీలక్ష్యం అందంగా మిమ్మల్ని ఆహ్వానిస్తుంది.

**ఉదా :** మీరు కోటి రూపాయల లక్ష్యాన్ని పెట్టుకొని ఉంటే ప్రతి రోజూ ఇన్ని రూపాయలు సంపాదించాలి అని ప్రణాళిక వేసుకొంటారు. ప్రతిరోజూ సంపాదించే ఆ రూపాయినే కోటి రూపాయిలుగా చూడండి. ప్రతి చిన్న పనినీ అపురూపంగా, శ్రద్ధగా చేయడం అలవాటు చేసుకోండి. ఒక శిల్పి ఎంత జాగ్రత్తగా... ఎంత శ్రద్ధగా శిల్పంలోని ప్రతి చిన్నభాగాన్నీ తీర్చిదిద్దుతాడో అలాగే మీ రోజువారీ లక్ష్యాలను, పనులను శ్రద్ధగా, ఇష్టంగా చెయ్యండి. ఇలా చేసే వాడే నిజమైన పనిమంతుడు. ఇలా చేసేవాడు ప్రపంచంలోనే గొప్ప నేర్పరిగా తయారవుతాడు. మీరు చేస్తున్న పనిలో దైవాన్ని చూడండి. మీరు చేసే రవ్వంత పనిలోనైనా పరిపూర్ణతను, ఉత్కృష్టతనూ కోరుకోండి. మీరు చేసే ఆ పనికి రేపటి మీ విజయంలో గొప్ప భాగంగా విలువ ఇవ్వండి. అణువులో బ్రహ్మాండాన్ని చూడగల్గండి. మీ రోజువారీ లేదా నెలవారీ చిన్నలక్ష్యాలు గొప్పగా పూర్తిఅయితే మీకు లభించే ఆనందం అంతా ఇంతా కాదు... మీరే అనుభవించి  తెలుసుకోండి.

## మీరు పనిచేయడానికి వెచ్చించే సమయాన్ని ప్రేమించండి

మీరు చేసే పనిని మాత్రమే కాదు ఆ పనిని చేయడానికి కాలం మీకిచ్చే సమయాన్ని కూడా ప్రేమించండి. స్కూల్లో చదువుకొనే పిల్లలకు స్కూలు పూర్తయ్యే చిట్టచివరి గంట అంటే చాలా ఇష్టం. తమకు కథలు చెప్పే మాష్టారి పిరియడ్ అంటే పిల్లలకు ఎంతో మక్కువ. ఆటలాడే సమయం అంటే ఎనలేని ఉత్సాహం, ప్రేమ. మీరు కూడా చిన్నప్పటి ఆ వ్యక్తిత్వాన్ని మళ్ళీ మీ నుండి మేల్కొల్పండి. మీరు ఒక రోజులో ఎన్నో పనులు చేయాలని ప్రణాళిక వేసుకుంటారు. అందులో ప్రతి పనిచేసే సమయాన్ని ఆనందించండి. ఇష్టపడండి,ప్రేమించండి. ఉదాహరణకు ప్రతి రోజూ సాయంత్రం ఒక పుస్తకం చదవాలను కున్నారు లేదా తోటపని చేయాలనుకున్నారు. సాయంత్రం వచ్చే ఆ గంట కోసం ఆతృతగా ఉండండి. అపుడే మీరు మీ పనిని మహత్తరంగా చేయగల్గుతారు. అంతేకాని... అయ్యో సాయంత్రం అయిపోయింది. అయితే ఇపుడు తోటపని చేయాలా? నాఖర్మ... తప్పుతుందా.. ప్రణాళిక వేసుకున్న తర్వాత.. ఇలా అయిష్టంగా చేసే పనిని వెంటనే నిలిపివేయండి. ఒక పనిని లేదా సమయాన్ని ఇష్టపడకపోతే ... తర్వాత ఏ పనినీ మీరు ప్రేమించలేరు.. పూర్తి చెయ్యలేరు.

"ఒక్క గంట నాకివ్వబడింది. ఆ గంటను నేను ఎంతగానో సద్వినియోగం చేసుకోవాలి". ఆ గంటకు సమయానికి ఉన్న విలువకంటే మరెంతో నేను సంపాదించాలి. అని మనసులో గట్టిగా అనుకొనండి. మీరు తప్పకుండా మీకున్న సమయాన్ని ప్రేమించగల్గుతారు. సృష్టిలో కాలమనేది మీకు ఇవ్వబడిన అతిగొప్ప బహుమతి. ఆ కాలాన్ని ప్రేమించగల్గితేనే

అది మీ చేత ఎన్నో అద్భుతాలు చేయిస్తుంది.

**మీ దురలవాట్ల ప్రభావం నుండి బయటపడండి**

తూర్పున సూర్యుడు ఉదయిస్తాడు - అనేది ఎంత సత్యమో దురలవాట్ల వలన మృత్యువు మరింత చేరువవుతూ వస్తూ ఉంటుంది అనేది కూడా అంతే సత్యం. ఒక అడుగు దురలవాట్లతో మీరు ముందుకెళ్తే పది అడుగులు మృత్యువు, అనారోగ్యాలు మీ వైపుకు వస్తాయి. ఇంత గొప్ప లక్ష్యం కోసం... ఇంతగా మారిన మీరు.. మీకున్న చెడు అలవాట్లను కూడా దూరం చేసుకోవడం ఎంతో ముఖ్యమని, తప్పనిసరి అని తెలుసుకోండి. ఈ దురలవాట్లతో ... కనీసం కొంచెమయినా మేలు జరుగగల్గితే ఫర్వాలేదు. కానీ అలా జరగదు. అన్ని వైపుల నుండి నష్టాలే వస్తాయి. ఒక గట్టి సంకల్పం మిమ్మల్ని మార్చగల్గినపుడు మీకున్న దురలవాట్లు ఒక లెక్కా. ప్రయత్నించండి... అన్ని విధాలా మీరు ఫర్ఫెక్ట్ అనిపించుకోండి. ఎందుకంటే మద్యపానం కానీ, మరే అలవాటు కానీ మీలో ఉన్న ఆలోచనా సరళిని నాశనం చేస్తుంది. మీ ఆలోచనలు చాలా బలహీనంగా ఉన్నప్పుడు.. మీరు సాధించబోయేవి కూడా బలహీనంగానే ఉంటాయి.

**మీ భాష... వేషధారణలో సవరణలు చేయండి**

ఒక గొప్ప లక్ష్యం ఉన్నందుకుగానూ, ఒక గొప్ప ప్రణాళికను అమలు పరుస్తున్నందుకుగానూ ఇతరులకంటే మీరు ఇపుడు ప్రత్యేకమైన వ్యక్తులు అని మరిచిపోకండి. ఇన్నాళ్ళూ మీ భాష, మీ వేశం ఎలా వున్నా సరే వాటిని

ఉన్నతంగా మార్చుకోండి. మీ వేషధారణ... **'మీరు మాట్లాడే పద్ధతి చూడగానే వీడు గొప్పదేదో సాధించడానికే పుట్టాడు'** అని అన్పించాలి. మీరు ఎలా తయారవ్వాలంటే ఏ రకంగానూ మీలో తప్పుల్ని వెదికే అవకాశం ఇతరులకు మీరు ఇవ్వకండి. నిరంతరం ఒక ఋషిలా ప్రసన్న వదనంతో ఉండండి. చిరునవ్వును మీనుండి దూరంకానివ్వకండి. మీరు పదిమందిలో మాట్లాడే పద్దతి మీకు తెలియకపోతే ప్రయత్నించి తెలుసుకోండి. ఎందుకంటే గొప్ప విజేతకు గొప్ప భాష అవసరం. మీ వేశధారణ కూడా మార్చుకోండి. చూసేవారికి మీలో ఏదో ప్రత్యేకత కొట్టొచ్చినట్లు కనబడాలి. మంచి వస్త్ర ధారణ పది మందిలో మిమ్మల్ని ప్రత్యేకంగా నిలబెడుతుంది. మంచి భాష.. పది మందిని మీకు చేరువ చేస్తుంది.

ఎందుకు ఇవన్నీ చేయాలి...? అని అంటారా. ఖచ్చితంగా చేయాలి. మనం మామూలు మనుషులం కాదు.. కాబోయే ప్రపంచ విజేతలం.. మనం వెయ్యబోయే సరికొత్త మార్గంలో మిమ్మల్ని అనుసరించడానికి కోట్లమంది ఉన్నారు. అన్ని ప్రత్యేకతలతోనూ ఈ ప్రపంచం దృష్టినీ, ఈ ప్రపంచ ప్రజానికాన్ని మీ వైపుకి మళ్ళించుకోబోతున్నారు. అందుకోసమే ఇవన్నీ చేయాలి. ఒక బిచ్చగాడు అయ్యో ... బాబూ ధర్మం చేయండి. అని దుమ్ముపట్టిన దుస్తుల్లో మీకు కన్పిస్తే ఈసడించుకుంటారు. అదే బిచ్చగాడు ఒక సాధువులా మారి కాశాయ వస్త్రంలో ముఖాన విబూది రాసుకొని హరహర మహాదేవ అని అంటే చేతులెత్తి నమస్కరిస్తారు. ఇదీ ... భాషకు, వేశధారణకు ఉన్న ప్రశస్తి.

**పని, ఇల్లు, మానవ సంబంధాల సమన్వయం**

మీరొక లక్ష్యాన్ని ఎంచుకొని ఇల్లూ, వాకిలి వాటిమానాన వాటిని వదిలేసి అకుంఠిత ధీక్షా పరుడిలా దీక్ష బూని పని చేసుకుంటూ పోతే నీ కుటుంబం సంగతేంటి. నీ భార్య, పిల్లలు, తల్లిదండ్రులకు నీ నుండి ఎంతో ప్రేమకావాలి. నీతో వాళ్ళు సమయం గడపాలనుకుంటున్నారు. వాళ్ళందర్నీ దూరంపెట్టి నువ్వు మాత్రం విజేతగా మారి చంకలు గుద్దుకుంటే... లాభం ఏమీ లేదు... మీ విజయంలో మీ కుటుంబానికి భాగమివ్వండి. మీ ప్రణాళికలో మీ కుటుంబంతో గడపడానికి సమయం ఇవ్వడం చాలా అత్యవసరం. మీరు ఒక్క గంట వాళ్లతో గడిపినా.. ఒక్క రోజంతా గడిపినంత సంతృప్తిని వారికి కల్గించేలా ప్రవర్తించండి. వాళ్ళు మీరు ముఖ్యమైన పనిలో ఉన్నారని అర్థం చేసుకొని మిమ్మల్ని ప్రోత్సహిస్తారు. ఎందుకంటే విజయం లభించినా, లభించక పోయినా నీ కుటుంబ సభ్యులే నీకు చిరకాల మిత్రులు. నువ్వు వారితోటే నీ జీవితం గడపాలి.

అందుకే చిరాకును, అసహనాన్ని కాల్చి బూడిద చేయండి. కష్టమైనా పడండి... నీ కుటుంబానికి, నీ కుటుంబ సభ్యులకు స్నేహితులకు మొదటి ప్రాముఖ్యతను ఇవ్వండి. నిరంతరం... నీ లక్ష్య సాధనకై పని చేసుకొని మిగిలిన ప్రతిదాన్నీ నిర్లక్ష్యం చేసేంత వర్క్ హాలిక్ మీరేమీ కానవసరం లేదు. తెలివైనవాడు అన్నింటినీ సమన్వయం చేయగలడు. ఒక చిన్న పిల్లవాడు స్కూల్లో తనకున్న అన్ని సబ్జెక్టులను ఎలా నిర్వహించగలడో అలాగే మీరుకూడా మీపని, సంపాదన, కుటుంబం, స్నేహితులు వీళ్ళందరిని సమన్వయం చేయగల్గండి.

అంతులేని ఆత్మ తృప్తి మీకు లభిస్తుంది. ఎందుకంటే ఇపుడు మీరు వీళ్ళందర్నీ నిర్లక్ష్యం చేస్తే నీ విజయం సంబవించినపుడు.. నీకోసం వాళ్ళు చప్పట్లు కొట్టాలిగా...

**ఒంటరివై పోరాడటం నేర్చుకో ...**

**'ఎవరి కోసమూ ఎదురు చూడకు ఒంటరిగానే ఈ ప్రపంచాన్ని జయించు',** అలెగ్జాండర్‌కున్న అపారమైన ఆత్మవిశ్వాసానికి ప్రతీక ఈ వాక్యం. నీకు సహాయం చేయడానికి, నిన్ను ప్రోత్సహించ డానికి ఎవరూ ఖాళీగా వుండరు. అలా ఉంటే నువ్వు అదృష్టవంతుడివే. ప్రతి పనిని నువ్వే ప్రారంభించు.. నీ చేతుల మీదుగానే జరిపించు. ఎవరి కోసమూ ఎదురు చూడకు. ఈ ప్రపంచంలోనే అతి గొప్ప విలుకాడిని కావాలనేది ఏకలవ్యుని గాఢమైన లక్ష్యం. కనీసం ఆ కోయవానికి గురువులేడు. సహాయం చేసేందుకు ఎవరూ లేరు. ఒక్కడే. . ఒక్కడే... ఒక్కడే... పిడుగులాంటి వజ్ర సంకల్పంతో... మట్టి బొమ్మలో గురువును చూసుకుంటూ విలువిద్యనుఅపర దీక్షతో అభ్యసించి ప్రపంచంలోనే గొప్ప విలుకాడయ్యాడు. తర్వాతి కథ మనకు అనవసరం.

**లక్ష్యం మాత్రమే కంటికి కన్పించాలి. నువ్వొక్కడివే దాన్ని ఛీ కొనాలి.**

నీ సంకల్పం, ఆత్మ విశ్వాసం, మండే కోరిక, నిన్ను మార్చుకోగల నేర్పు ఇంతమంది నీకున్న సైన్యం. ఇక నీకెవరి తోడుకావాలి. నీకెవరి సహాయమూ అక్కర లేదు. ఒకడు చేసిన సహాయంతో మెట్లు ఎక్కాల్సిన అగత్యం నీకు లేదు. నీవే విజేతవు.. నీదే గొప్ప లక్ష్యం నీవు ఒంటరివైనా ప్రపంచాన్ని శాసించగలవ్.

**నిముషాలను సద్వినియోగం చేసుకోవడం నేర్చుకో ...**

త్వరగా నీ లక్ష్యాన్ని చేరుకోవాలంటే 6 గంటలు అంటే 360 నిముషాలను ఒక రోజులో ఉపయోగించుకోమని చెప్పాను. ఉద్యోగం లేదా వ్యాపారం చేస్తున్న వాళ్ళైతే దాన్ని 180 నిముషాలుగా కుదించుకోవచ్చు. ఎంత సమయం వెచ్చించాలి అనేది మీనిర్ణయం. కానీ వెచ్చించిన సమయంలోని ప్రతి నిముషము వృధాకాకుండా ఉపయోగించు కోవాలన్నదే నా సందేశం. మీరు మిషన్ ఇంపాజిబుల్ అనే హాలివుడ్ సినిమా చూసే వుంటారు. చూడకపోతే చూడండి. అందులో ఒక పనిచెయ్యడానికి అతనికి కొన్ని నిముషాలు మాత్రమే ఇవ్వబడుతాయి. అపుడు ఆ హీరో సెకను కాలం వృధా చేయకుండా తనకివ్వబడిన గొప్ప పనిని సమర్థవంతంగా పూర్తి చేస్తాడు. అతను అలా చెయ్యలేకపోతే భారీ విధ్వంసం జరిగేది. అంత తక్కువ కాలంలో ఆ పని చెయ్యడం అసాధ్యమనిపిస్తుంది. అలా అసాధ్యం అనుకున్న వాటిని సాధ్యం చెయ్యడమే ఆ సినిమా వృత్తాంతం. ఒక్క బాంబును డిస్పోజ్ చెయ్యడానికి బాంబ్ స్క్వాడ్ లోని ఒక వ్యక్తి ప్రయత్నిస్తాడు. 2 నిముషాలలో బాంబు పేలిపోతుంది. అంటే 120 సెకనుల సమయం. ఈ లోపు గానే ఆ వ్యక్తి బాంబుని నిర్వీర్యం చేయాలి. లేదంటే అతన జీవితం, మిగిలిన వాళ్ళ జీవితాలు ఏమౌతాయో తెలుసుగా. ఈ సందర్భంలో ఒక్క సెకను కూడా అతి విలువైనది. ఇక్కడ కాలమే ప్రాణం. 120 సెకన్లలో బాంబును నిర్వీర్యం చేసే కేబుల్‌ను కనిపెట్టి కత్తిరించగలగాలి. పై రెండు సందర్భాల్లో నిముషానికి ఎంత విలువ వుందో అర్థమైందిగా. నీకున్న 3 లేదా 6 గంటలలో ఉన్న ప్రతి నిముషాన్నీ నువ్వు అంతే విలువైనదిగా భావించాలి.

అలాభావించగల్గితే.. నీ ప్రయాణం అద్భుత ఫలితాన్ని ఇస్తుంది. మీ నిముషాలను వృధాకాకుండా ఎలా ఉపయోగించుకోవాలో నేను కొన్ని సూచనలు ఇస్తాను. చదవండి.

1. మీ ప్రణాళికలోని మొదటి పని చెయ్యడం పూర్తవగానే రెండు నిముషాలు మాత్రమే ఉపయోగించి తర్వాత ఏ పని చెయ్యాలో నిర్ణయించుకోండి.
2. తర్వాత చెయ్యవలసిన పని నీకు తెలియగానే ఒక్క నిముషము కూడా వృధా చేయకుండా పని ప్రారంభించండి. (తర్వాత ఏ పని చెయ్యాలి అని ఆలోచించిన ఆ రెండు నిముషాలు వృధా కాలేదు గమనించండి. ఎందుకంటే అలా ఆలోచించి నిర్ణయం తీసుకోకపోతే తర్వాత ఏ పని చెయ్యాలో తెలియక మరికొన్ని నిముషాలు వృధా అవుతాయి.)
3. గంటలో చివరి 5 నిముషాలు... ప్రశాంతంగా ఏమీ ఆలోచించకుండా ఉండండి. ఈ 5 నిముషాలు ఒత్తిడిని తగ్గిస్తాయి.
4. మీకు మిగిలిన 5 నిముషాలలో కూడా ఒక మంచి పుస్తకంలోని రెండు పేజీలు చదివి విషయాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగించండి.
5. రెండు నిముషాల వ్యవధి దొరికినా గొప్ప పాటను గుర్తుతెచ్చుకొని మీరే పాడేయండి. లేదా భవిష్యత్తులో మీ లక్ష్యం పూర్తయితే మీరెలా ఉండబోతున్నారో ఊహించుకోండి.
6. అన్నింటికంటే ముఖ్యమైనది మీరు వేసుకున్న ప్రణాళికను విఫలం కాకుండా పాటించండి.

7. ఒక్క నిముషం దొరికినా ఒక మంచి వాక్యాన్ని లేదా ప్రేరణ కల్గించగల పాటను మీ స్నేహితుడికి చెప్పండి లేదా వినండి.

8. అన్ని పనులు పూర్తయి ఇంకో పది నిముషాలు మీకు మిగిలినా మీ లక్ష్య సాధనకు కావాల్సిన మార్గాల గురించి ఆలోచించండి. లేదా మీ భాషను లేదా ఇంగ్లీష్ భాషను నైపుణ్యం పెంచుకోవడానికి కొన్ని కొత్త పదాలను నేర్చుకోండి.

9. టి.వి. చూడాలనిపించినా... మీకు ఉపయోగపడేవి, ప్రేరణ కల్గించేవిగా ఉన్న ప్రసారాలనే చూడండి. మీరు ఏ చిన్న పనిని చేసినా అది మీ లక్ష్య సాధనకు ఒక అడుగు ముందుకేసేలా ఉండేటట్లు చెయ్యండి. ఎందుకంటే.. **నువ్వు విజయం సాధించాలంటే ... నీవు నీ విజయం వైపే ప్రతి అడుగు వెయ్యాలి.**

10. ప్రతి నిముషాన్నీ ఉపయోగించుకొని... విలువైన ప్రతిఫలం అనుభవించాలని ఘాఢంగా కోరుకోండి.

11. మీరు ఖర్చు చేసే ఒక్క నిముషమైనా, **‘విలువైనది’** పొందేందుకే ఖర్చు చెయ్యండి.

# సాధన చెయ్యండి - సాధించండి

విజయం సాధించడానికి సులభమైన అడ్డదారి మరొకటుంది అది ఏమిటో తెలుసా.... సాధన చేయడం. 'తినగ తినగ వేము తియ్యనుండు' అని యోగి వేమన గొప్ప సత్యాన్ని చెప్పాడు. ఈ వాక్యాలూ, సూక్తులూ, ప్రేరణ కల్గించే కథలు అందరికీ తెలిసే ఉంటాయి. తెలుసుకుంటే సరిపోదు. ప్రయత్నించి సాధించాలి. దీనికి మాత్రం అడ్డదారులు లేవు. ప్రయత్నమూ, అభ్యాసమూ వల్లనే విజయం సిద్ధిస్తుంది. ఈ నిజాన్ని గట్టిగా విశ్వసించండి. విశ్వసించి ప్రయత్నించండి. ఎంతటి కష్టమైన పనైనా అభ్యాసం చేస్తే, నిరంతర సాధన చేస్తే తప్పక ఫలిస్తుందని అందరికీ తెలుసుగా... మరి ప్రారంభించండి. వేగంగా టైపు చెయ్యగల వ్యక్తిని వేగంగా టైపు చెయ్యగల్గాలంటే ఏం చేయాలి. అని అడిగితే ఆయన ఇలా సమాధాన మిచ్చాడు. నెమ్మదిగా టైపుచేయాలి.

భయాన్ని పోగొట్టుకోవాలన్నా, మంచి వక్తలాగా మాట్లాడాలన్నా, దురలవాట్లు మానెయ్యాలన్నా, నైపుణ్యం పెంచుకోవాలన్నా, కోపాన్ని తగ్గించుకోవాలన్నా, అసలు ఎంత కష్టమైన దాన్నైనా సాధించాలంటే ప్రతిరోజూ... మెల్లమెల్లగా సాధనచేసి పొందడం ఒకటే మార్గం. మొదట్నుంచి తెలుగు మీడియంలో చదవడం వలన నాకు ఇంగ్లీష్ మాట్లాడటం అసలు వచ్చేదికాదు. నా డిగ్రీ పూర్తయిన తర్వాత నేను సుమారు వంద ఇంటర్వ్యూలకు వెళ్ళి ఉంటాను. ప్రతి దాంట్లోనూ విఫలమయ్యాను. ఎందుకంటే నేను ఇంగ్లీషులో మాట్లాడలేక పోయాను. కానీ నేను తెలుగులో గొప్పగా రాయగలను. చాలా తెలివైన విద్యార్థి కూడా. కానీ ఏం చేయను. ఆ సంస్థలకు ఇంగ్లీష్

కావాలి. నాకేమో అదిరాదు. ఎన్నో అపజయాల తర్వాత నేను గ్రహించిన విషయం ఒకటే.. ఇంగ్లీష్ మాట్లాడలేక పోతే నాకు ఉద్యోగం వచ్చేలా లేదు అని. అప్పట్నుంచి ఇంగ్లీష్ భాషపై పట్టు సంపాదించుకోవడమే లక్ష్యంగా పెట్టుకొన్నాను. సుమారు 200లకు పైగా ఇంగ్లీష్ సినిమాలు చూశాను. వందలకొద్దీ పుస్తకాలు చదివాను. అయినా నాకు అంతంత మాత్రంగానే మాట్లాడటం వచ్చేది. అప్పుడు నేనొక విషయాన్ని గ్రహించాను. **'ఎంత తెలుసుకున్నా సాధన చేయకపోతే వ్యర్థం'** అని. అప్పట్నుంచి నేను ఆలోచించడం కూడా ఇంగ్లీష్‌లోనే ఆలోచించేవాణ్ణి, గంటల కొద్దీ నాకు తెలిసిన చిన్నప్పటి కథలన్నీ ఇంగ్లీష్‌లోకి మనసులోనే మార్చి చెప్పుకునేవాణ్ణి. నా జీవితంలో జరిగిన ప్రతి సన్నివేషాన్ని ఇంగ్లీషులో చెప్పుకోవడం ప్రారంభించాను. కేవలం 3 నెలల్లో నేను అద్భుతంగా ఇంగ్లీష్ మాట్లాడటం, రాయడం నేర్చుకున్నాను. రెండు వేల మంది ఉన్న సభలో సుమారు రెండు గంటలపాటు ఇంగ్లీషులో ప్రసంగం ఇవ్వగలిగాను.

మీరూ ప్రయత్నించండి. నిరంతరం సాధన చెయ్యండి. మీకు ఏదైతే రాదో దాన్ని వదిలేయకండి. దాని పూర్తి చేసే విశ్రమించండి. **'ఎప్పుడూ ఓటమిని ఒప్పుకోకు'.** అన్నీ త్వరగా నేర్చేసుకోవాలనే ప్రయత్నమే మీ కొంపముంచుతుంది. నెమ్మదిగా సాధన మొదలెట్టి.... రాను రాను వేగం పెంచండి.. సాధించలేనిది అంటూ ఏదీ లేదు.

పైన చెప్పినవన్నీ... మీకు తెలిసే వుంటాయి. ఇవేమైనా గొప్ప రహస్యాలా లేదా గొప్ప సూత్రాలా ఆ మాత్రం మాకు తెలియదా! అని అనుకుంటున్నారామో. గొప్ప సూత్రాలు

తెలుసుకున్నంత మాత్రాన పని జరగదు. వాటిని అనుసరించి పాటిస్తేనే, ప్రయత్నిస్తేనే ఫలితం ఉంటుంది. పైన చెప్పినవి అన్ని విషయాలు, చిట్కాలు స్వానుభావంలో గొప్ప ఫలితాలను ఇచ్చినవే. వాటిని నమ్మి పాటిస్తే పూర్తిగా నూరుశాతం ఫలితాలను ఇస్తాయని నేను గర్వంగా మీకు చెప్పగలను. ఇవన్నీ నువ్వు చదివి, అర్థం చేసుకొని కష్టమైనా పాటించి ప్రయత్నించినా కూడా నీకు విజయం దక్కలేదంటే... ఖచ్చితంగా సూర్యుడు పశ్చిమాన ఉదయిస్తాడు. నీ జీవితానికి పూర్తి బాధ్యుడవు నీవే... నువ్వు మాత్రమే... నిన్ను మార్చుకోగలవు... ప్రయత్నంతో.... ప్రయత్నం వలన సర్వసూ సిద్ధిస్తుందని మరొక్క మారు నేను గర్జించి చెప్తున్నాను. ఇది నిజం.

## గెలుపును నిలుపుకో ...

అంతా ప్రయత్నించి గెలుచుకున్న విజయాన్ని కలకాలం నిలుపుకోవడమే అసలైన గెలుపు.
ఇలా శ్రమించి సాధించిన విజయాన్ని జీవితాంతం అనుభవించాలి అంటే మనకు గొప్ప వ్యక్తిత్వం కావాలి.
వ్యక్తిత్వం అంటే ఏమిటి ?
ఒక మనిషికి... ఉండవలసిన లక్షణాలను, గుణాలను గురించి తెలుసుకుని పాటించి మీలో ఆ గుణాలు, లక్షణాలు కల్గి ఉండడమే. ఈ వ్యక్తిత్వ వికాసం గురించి తెలుసుకోవాలంటే ఎందరో మహానుభావులు రచించిన పుస్తకాలు చదవండి.
ప్రయత్నించి గొప్ప వ్యక్తిత్వాన్ని సొంతం చేసుకోండి.
గుర్తించుకోండి.
మీరు ఎలా మారాలనుకుంటే అలా మారగలరు.

**"మీరు ఏం కోరుకుంటే అది పొందగలరు.**
**జ్వలించే కోరిక మీ గుండెల్లో నిరంతరం జ్వలిస్తున్నంత కాలం మీరు దేన్నైనా సాధించగలరు.**
**కోరికలు అందరికీ ఉంటాయి.. కానీ జ్వలించే కోరికలే సాకారమవుతాయి".**

# పరిపూర్ణమైన మనిషి

మిత్రులారా.. గొప్పలక్ష్యం కోసం మీరు శ్రమించి మీరు కోరుకున్న కలలను నిజం చేసుకుని మీ ఊహలను నిజం చేసుకొని సకల సంపదలతో, విజయ గర్వంతో.. గొప్ప విజేతలవ్వాలని మనసారా నేను అభిలషిస్తున్నా...

చివరగా ఒక్క మాట ...

**అసలు... మనిషికి నిజమైన గెలుపు ఏది?**

ఒక లక్ష్యం పూర్తి చేసుకుని వెంటనే మరొక లక్ష్యం పెట్టుకుని గెలుచుకుంటూ పోవడం.. ఇదేనా గెలుపంటే.. లేక ఇంకేదేనా ఉందా? ఖచ్చితంగా ఉంది. మీకు కావాల్సినవన్నీ దొరికిన తర్వాత అంటే మీ లక్ష్యం నిజమై మీకు కావాల్సిన సంపద, ఎన్నేళ్ళు తిన్నా తరగని ఆస్తి, ఘనకీర్తి... సంపూర్ణ ఆరోగ్యం.. గొప్ప వారసులు... ఇలా... నీకు కావాల్సివన్నీ నెరవేరిన తర్వాత చివరగా నీకు కావాల్సింది ఏమిటి ?

**"ఆనందం"**

అవును. చివరికి ఆనందం తప్ప ఇంకేమీ కోరికలు, బాధ్యతలూ ఉండకూడదు. నీ అంతిమ యాత్ర వరకూ నీక్కావలసింది ఆనందమే. సంపూర్ణమైన తృప్తి నీ జీవితం నీకిచ్చిన సంపూర్ణమైన తృప్తి మాత్రమే ఆనందాన్నిస్తుంది. అంతా నీకు లభించిన తర్వాత... ఇంకా కావాలని పాకులాడవద్దు. ఏదో ఒక దశలో నీ ప్రయాణానికి ముగింపు చెప్పి నిరంతరం ఆత్మానందాన్ని పొందేందుకు ప్రయత్నించు. ఏమి చేస్తే ఆనందం దొరుకుతుందో అన్వేషించు. ఆ ఆనందాన్ని కూడా నువ్వు

గెలుచుకోగలిగా వుంటే నీవు ఒక పరిపూర్ణ మనిషి అనబడతావు.

**సృష్టిలో అందరికీ ఆనందమే అంతిమ విజయం. దాని తర్వాత సాధించడానికి ఏదీ ఉండదు.**

దీని గురించి ఎ కంప్లీట్ మ్యాన్ అనే నా తర్వాత రచనతో మిమ్మల్ని కలుస్తాను.

ప్రేమతో ...

కృతజ్ఞతతో ...

**మీ ... సాగర్ సింధూరి**

1 జీవితంలో గొప్ప సాహసం అంటే –
గొప్ప లక్ష్యాన్ని నిర్ధేశించుకోవడం
గొప్ప జీవితం కోరుకోవడానికి ధైర్యం చెయ్యి.

2. నిజమైన లక్ష్యాన్ని నువ్వు తెలుసుకున్నట్లయితే దేవుడు నిన్ను ఎందుకు సృష్టించాడో నువ్వు తెలుసుకున్నట్లే

3. ఏదైతే నీలో ఉత్తేజాన్ని, చైతన్యాన్నీ, శక్తినీ రగిలించి నీ భవిష్యత్తును చూపించగలదో అదే – నీ లక్ష్యం

4. మరణించే లోపు నిన్ను నువ్వు ఈ ప్రపంచానికి గొప్పగా పరిచయం చేసుకో.

5. 'విజయం' అనే తృప్తి లేకుండా వెలితితో మరణించకు

6. నువ్వు చూడలేని దాని దగ్గరకు నువ్వు చేరలేవు. అందుకే చూడాలనుకుంటున్న గొప్ప భవిష్యత్తును ముందుగానే చూడు.

7. కోట్ల విలువ చేసే లక్ష్యం నీకుండగా – నువ్వు పేదవాడివి కాదు.

8. సర్వస్వం నువ్వు కోల్పోయినా ... ఇంకా నీ దగ్గర ఒకటి మిగిలే ఉంది, అది "రేపు"

9. జీవితాన్ని 'జీవించాలి' కానీ బ్రతక కూడదు.

10 నీ కేది కావాలంటే అది ఇవ్వడానికి ఈ ప్రపంచం సిద్ధంగా ఉంది ప్రయత్నించి తీసుకోవాలంతే!

11 నీ జన్మకు ప్రతిఫలంగా నువ్వు ఈ ప్రపంచానికి గొప్ప బహుమతి ఇవ్వాలి.

12 దేవుడు గెలుపును సృష్టిస్తే ... మనిషి ఓటమిని సృష్టించుకుంటున్నాడు.

13 నీ ప్రయత్నమే మారు వేషంలో ఉన్న నీ విజయం

14 ప్రతి రోజు కొంత సమయం నువ్వొక గొప్ప వ్యక్తిని దర్శించాలి, అదెవరంటే 'నువ్వే'

15 ప్రపంచంలో అందరికీ కోరికలుంటాయి .. కానీ నిరంతరం 'జ్వలించే' కోరికలే సాకారమవుతాయి.

16 పరుగు పందెంలో ... కాలాన్ని గెలవగలవేమో ప్రయత్నించు

17 విజయానికి తల్లిదండ్రులు ఎవరో తెలుసా?
నీ మనసు ... నీ మెదడు

18 స్విచ్ వేస్తే బల్బు వెలుగుతుంది ... ప్రయత్నిస్తే విజయం లభిస్తుంది.

19 ప్రేమను పంచగలిగితే...
నీకు తిరిగి ప్రేమ దొరుకుతుంది.

20 నీలో ఆవేశం వుంటే లక్ష్యం వైపు గురిపెట్టి జరిగే అద్భుతాన్ని చూడు.

- సాగర్ సింధూరి